# ముఖ్య విషయం

1956 ఏప్రియల్ నెలనుండి స్రవంతి సంవత్సర చందా రు 2-0-0 ల నుండి రు 3-0-0 లకు మార్చబడినది. ఈ మార్చి నెల 31 వ తేదీలోపల చందా దారులుగా చేరినవారికి ప[illegible]డు వారికి రు 2-0-0 కే పన్నెండు సంచికలు అందచేయబడును. ఏప్రియల్ నుండి చందాదారులుగా చేరువారు రు 3-0-0 లు చెల్లించవలసి ఉంటుంది.

విడిప్రతి ధరలో మార్పులేదు.

ఫోన్ : 4406

టెలిగ్రామ్: హిందీసంఘ

సంచిక ౭

సంపుటి ౧

# ప్రవంతి

సాహిత్య మాసపత్రిక

మే 1956

★

సంపాదకులు

వేమూరి ఆంజనేయశర్మ

సి. నారాయణరెడ్డి

★

హైద్రాబాదు హిందీ ప్రచార సంఘము

327, రెసిడెన్సీ రోడ్డు — హైద్రాబాదు.

సంవత్సర చందా
రు. 3-0-0

విడిప్రతి
రు. 0-4-0

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide. Proceedings Dis No. 30/55 dated 6th January 1955.

## ఈ సంచికలో


1. సంపాదకీయం

2 విశ్వకవి (కవిత)
—శ్రీ వంగల పార్థసారథి ఆచార్యు

3 మా గ్రామం (స్కెచ్)
—శ్రీ పొట్లపల్లి రామారావు

4 పాపలసింగారం (గేయం)
—శ్రీ నండూరి వెంకటసుబ్బారావు

5 వ్యత్యాసం (కథానిక)
—శ్రీ సామవేదం జానకిరామశాస్త్రి

6 కళోపాసకుడు (కవిత)
—శ్రీ చొల్లేటి నృసింహశర్మ

7 కోతలు (ఊబుసుపోక - 2)
—శ్రీ ధరణికోట శ్రీనివాసులు

8 మహాబోధి (నాటిక)
—శ్రీ దాశరథి

9 మళయాళ సాహిత్యము - 2 (వ్యాసము)
—శ్రీ ఆర్. కె. రావు

10 జానపద గేయములు - హాస్యము (వ్యాసము)
—శ్రీ బి. రామరాజు M A

★ 11 పుస్తకపరిచయము

12. హిందీ వార్తలు – స్వాగతోపన్యాసము

సంపాదకీయము

## తెలుగు సాహిత్య పరిషత్తు

క్రిందటి రెండునెలలూ వరసగా ప్రచురింపబడిన మా సంపాదకీయాలలో తెలుగు సాహిత్యపరిషత్తును స్థాపించవలసిన అవసరాన్ని తెలియజేసి ఉన్నాము.

మొన్న ఉగాది పండగనాడు హైదరాబాదులో కొందరు మిత్రులు ఆ పరిషత్తు కొక రూపకల్పన చేయడానికి ప్రయత్నం ప్రారంభించారు. వారి ప్రయత్నము ప్రశంసనీయం. శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారలు తమ హైదరాబాదు రాక సందర్భంలో ఈ విషయమై హైదరాబాదులోని కొంతమంది ప్రముఖరచయితలతో సంప్రతించి యున్నారు. వారిద్దరు తయారు చేసిన విజ్ఞప్తిపత్రము సర్వవిధములా ఉపయుక్తంగా ఉన్నది. ఆ పత్రంలో అవసరమైన మార్పులను చేసుకొనవచ్చును. ఈ విషయమై హైదరాబాదు పత్రికలలో ప్రచురింపబడిన కొన్ని ఉత్తరాలను గూడా చూశాము. సత్కార్యాన్ని ఎవరు ప్రారంభించినా మంచిదే గదా ! అయితే సత్కార్యం కొరకు జరిగే కృషిలో ఎవ్వరూ ఉపేక్షింపబడకూడదు. తెలుగు భాషా ప్రచారానికి, తెలుగుసాహిత్య వికాసానికి తోడ్పడుతున్న సంస్థల, వ్యక్తుల సహకారం పరిషన్నిర్మాణానికి చాలా అవసరం. గౌరవనీయులైన శ్రీరామకృష్ణారావు, చెన్నారెడ్డి గార్ల ఆశీర్వాదంతో ప్రారంభమైన ఈ ప్రయత్నం ఈసారి అయినను తప్పక విజయవంతం కాగలదని విశ్వసిస్తున్నాము. ఈ విషయమై పాఠకులు, పండితులు తమ తమ సలహాలను ఉపయోగకరమైన వానిని పంపిస్తే స్రవంతిలో ప్రచురించగలమని మనవిచేస్తున్నాము.

స్రవంతి పాఠకుల ఉపయోగం కొరకు ఉగాదినాడు హైదరాబాదులో ప్రచురింపబడిన విజ్ఞాపన పత్రాన్ని ప్రచురిస్తున్నాము.

"మన రాజ్యాంగంలో పేర్కొన్న ప్రాంతీయభాషలలో జనసంఖ్యనుబట్టి తెలుగు ప్రథమ స్థానాన్ని అలంకరిస్తున్నది. తెలుగు భాష సాహిత్య వికాసంలో గూడా బెంగాలివంటి భాషలతో సరితూగ

గలిగియున్నది. బెంగాలీ, మహారాష్ట్రము, కన్నడము మొదలగు భాషలకు ఏక సాహిత్యపరిషత్తు లేర్పడి భారత సాహిత్య ఎకాడమితో, ఇతర భాషా సాహిత్య పరిషత్తులతో, ప్రాంతీయ విశ్వ విద్యాలయములతో, వివిధ ప్రభుత్వములతో సాహిత్యాది విషయము లందు ప్రాతినిధ్య ప్రతిపత్తితో వ్యవహరిస్తున్నవి.

తెలుగు మాట్లాడే వారందరికి ప్రాతినిధ్యంవహించే పరిష త్తొకటి లేకపోవుట విచారకరం. ఆంధ్ర సాహిత్యపరిషత్తు, సాహితీ సమితి, నవ్యసాహిత్య పరిషత్తు, ఆంధ్ర సారస్వతపరిషత్తు, తెలుగు భాషాసమితి, తెలంగాణా రచయితల సంఘము, రాయలసీమ సాహిత్యపరిషత్తు, అభ్యుదయ రచయితలసంఘమువంటి సంస్థలెన్నో ఒకొక్క ప్రయోజనంకొరకు యేర్పడి యథాశక్తిగా సాహిత్యారాధన చేస్తున్నవి. వీనిలో ఏదియును ఇతర భాషాసాహిత్య పరిషత్తులవలె యావదాంధ్ర ప్రజకు ప్రాతినిధ్యం వహించలేకపోతున్నది. అందువలన మన భాషకు సాటి భాషలలో రాదగిన గౌరవం లభించ కుండా పోతున్నది. కాబట్టి తెలుగు భాషకు ఏకప్రతినిధియైన పరిషత్తును నిర్మించుకోవాలి. ఆ పరిషత్తు,

1. భారతసాహిత్య ఎకాడమీకి తెలుగు భాషా వ్యవహారాలకు సంబంధించిన సలహాలిచ్చేదిగా ఉండాలి.
2. ప్రదేశప్రభుత్వాలతో, విశ్వవిద్యాలయాలతో తెలుగు భాషా విషయములను గురించి అధికారంతో చర్చించేదిగా ఉండాలి.
3. తెలుగురచయితల నాదరిస్తూ రచయితకు, పాఠకులకు అనుబంధం గూర్చే సహకారసూత్రము నవలంబించి గ్రంథప్రచురణ సాగిస్తూ గ్రంథరచన బ్రతుకుతెరు వయేటట్లు సమర్థించవలెను.
4. ఇతరప్రాంతములలో తెలుగు సాహిత్యప్రచారమును, మన ప్రాంతాన ఇతర భాషాసాహిత్య ప్రచారమును చేయవలెను.

ఈ ఆశయసిద్ధికోసం తెలుగుదేశంలో వివిధ సాహిత్య సంస్థల, ప్రసిద్ధ రచయితల, ప్రాంతీయ ప్రభుత్వముల, విశ్వవిద్యా లయముల సహకారమును సంపాదించవలెను."

# విశ్వకవి

శ్రీ వంగల పార్థసారథిఆచార్య

నా కవిత్వమ్ము చదివి మాధ్వీకరస మ
టంచు మెచ్చెడి వారి సౌహార్ద్రి మరసి
పొంగుటకు మారు క్రుంగిపోవుదును సామి ।
కాను సహజమ్ముగ కవిని నే కానుకామ ।।

ఆ పొగడ్తకు తగుదువీ ; వఖిల ప్రకృతి
శక్తులు సమన్వయించి శాశ్వత మహా ప్ర
బంధము నపూర్వ లక్షణ బంధురముగ
నొకడవే నిబంధించు విశ్వకవి వీవు ।।

అది బ్రహ్మాండము నిందు గ్రంథము । తదాద్యంతమ్ము లెవ్వారికే
ని దురూహ్యమ్ములు । వాఙ్మనఃకరణ నిర్ణీత స్థితిన్ మించిన
ట్టిది నీ భావసమాధి । నీ కళల సృష్టిన్ భిన్నతల్ మాయుచున్
చిదచిద్రూప పదార్థముల్ నిరవధి శ్రేయోనిధిం దేలెడున్ ।।

లెక్కకు మీరు వేల్ పుటలు ద్రిప్పుచు నెప్పటి కప్డు క్రొత్తగా
నొక్కొక సర్గ చేర్చికొను చుండెడి విశ్వకవీ । దిదృక్షకుం
జిక్కి భవత్పదాంతికము జేరిన నన్ను రసైక భిక్షుకున్
న్యక్కృతిసేయ కొక్కక్షణ మారయ విమ్ము జగత్ప్రబంధమున్ ।।

ఈనిజమే నెఱింగితి జుమీ ! ఇట ప్రక్రియ అద్భుతమ్మగున్ !
దాని కిదా సమన్వయ విధానము ! దీనికి శ్లేష యిద్దియా !
దీనికి వ్యంగ్యధర్మ మిది ! దీని కిదే ధ్వని పో ! అలంకృతుల్
దీనికి నంద మిచ్చినవిలే !! రససిద్ధుడ వో మహాకవీ !!

మూగవోయిన వక్షరమ్ములు ! తనంత
ప్రకృతి వికృతుల పారతంత్ర్యము జయించి
స్వైరముగ మహాకావ్యమ్ము సాగిపోయె !
నింతవరకు ! పరిసమాప్తి యెపుడొ ! యెటులొ !!

అఖిల విశ్వమ్ము నాదయోగాత్మకముగ
ఒక్క గీతిలో వినిపింతు వోయి సామి !!
విశ్వగాయక ! విశ్వకవీ !! సమస్త
కళలు కందుక క్రీడలు గాదె నీకు ?



*"స్వాతంత్ర్యం ఒకరు పెట్టే బిచ్చంకాదు. అది మన హృదయంలోనుండే రావాలి"*

—శ్రీ వినోబాజీ

స్కెచ్ :

# మా గ్రామం

—శ్రీ పొట్లపల్లి రామారావు

మీరు రావడం మూలాన మా గ్రామం ధన్యమైంది అట్లాచూస్తే. ఎడపా, దడపా ఎవరో ఒకరు వస్తూనే ఉంటారు పట్టణవాసులు కాని ఎప్పుడు తమ పని ముగుస్తుందా? ఎప్పుడు యిల్లు చేరుకుంటామా? అనే ఆతురత తప్ప వాళ్ళకు రెండోధ్యాస ఉండదు పల్లెటూరికి రావడ మనేది వాళ్ళకో పెద్ద సమస్యగా ఉంటుంది కాని మీలాటివాళ్లు ఎందరుంటారు? పట్టణ వాసుల మోస్తరు, పల్లె వానులకు ఉండే భ్రాంతులు, ఆశలు, స్వప్నాలు, ఏమిటో తెలుసుకోవడానికి కుతూహల మున్న వాళ్ళు?

అయితేరాండి; మా గ్రామం విశేషాలు మీకు వివరంగా చూపెడుతాను

యిప్పుడు మనము ఊరి పొలిమేరలో కాలు పెట్టాము అదిగో చూడండి; ఆ వంపులోనుండి మెలికలుగా ప్రవహిస్తున్నది అది మాఊరు వాగు; ఇది మాగ్రామానికి జీవనాడి; దీని కాల్వల మూలాన మాపొలాలు పండి మా కుత్తును పాపుతాయి నిత్యం మా గ్రామస్త్రీలు తోడుకొని వచ్చే దీని చల్లనినీరు మా దాహాన్ని తొలిగిస్తాయి దీని నీరాల మునకులాడి మా నిత్యశ్రమను తొలిగించుకుంటాము యిది మా పిల్లల క్రీడాస్థలము; వయసు చెల్లిన మా పెద్దల విశ్రాంతిస్థలము; ఇది మా ఊరు వచ్చేవారిని మందహాస వదనంతో ఎదుర్కొని మంచినీరు అందిస్తుంది పోయేవారికి చల్లని గాలితో వీడ్కోలు చెప్తుంది ఇది మా మాతృదేవత; దీని చంకలో పిల్ల మా గ్రామం; అదిగో; ఊరువెలుపలనే దర్శన మిచ్చిన ఆ ముసలి మా ఊరిఎలవాడు దొర తరవాత దొర ననుకుంటాడు. కాని ఆదర్పము బయటికి కనపడనివ్వడు దూరంనుంచే మనుషుల గుర్తు పడుతాడు వాడు అధికారులు, చదువుకున్నవాళ్ళు, యిలాటి పై తరగతికి చెందిన వాళ్ళైతే పది అడుగులు ఎదురుగావచ్చి వినయంగా తలవంచుతాడు ముందు ముందు వరుగెత్తి చావడిలో మంచము వాల్చుతాడు ఆకాశంనుంచి యిష్టదేవతలు దిగినట్టు ఎట్టివాని కోసరం కూతలు వేస్తాడు. లేక గ్రామానికి సంబంధించిన పెద్దలైతే ఊరిలోని ఏదో వార్త నెమ్మదిగా చెపుతు మా వెనువెంట యింటివరకు వినయంగా అనుసరిస్తాడు. లేక పొరుగుగ్రామానికి సంబంధించినవారైతే ఊరిబయటివరకు సాగనంపుతాడు లేక ఎవరయినా మధ్యరకం వాళ్ళయితే ఏదో వరసతో పిలిచి బాంధవ్యం కలుపుకొంటాడు ఆ బాంధవ్యం అడుగునగూడా దర్పం ఉంటుంది. యిక సాధారణ జనం అయితే "అట్లా పిలవబడు" అని గద్దిస్తాడు వాళ్ళు తెల్లబోయి పిలవబడుతారు

"ఎవడయినా సరే; చావడిదగ్గర నిలవబడిపోవాలె" హుకుం జారీచేస్తాడు వాళ్ళు "అయ్యా" అని తల ఊపుకుంటు పోతారు.

బయట ఎంత కటువుగా వర్తించినా, ఇంట కాలుపెట్టగానే మేకపిల్ల అయిపోతాడు. ముసలివాడు సహజంగా సౌమ్యస్వభావుడు.

కాని పుట్టుకనుండి దొరలక్రింద ఉండటం మూలాన వాళ్ళ కణుకుదనం, తీవ్రత అలవాటు అయిపోయినాయి వాడు ఎన్నడు ఊరుదాటి ఎరగడు చుట్టాలు, స్నేహితులు, ఈలాటి బంధనాలు వాడిని బాధించవు వాడి ఉద్యోగం అలాటిది ఎప్పుడు ఏనిమిషాన ఎవరు పిలుస్తారో అని వాడు అస్తమానం చావడి దగ్గర కనిపెట్టుకొని ఉంటాడు అప్పుడప్పుడు తింటువ్న కించముపైనుండే లేచి రావలసి వస్తుంది లేకపోతే వాడి ఖర్మం వాడు అనుభవించాల్సి ఉంటుంది

సముద్రములోతు తెలుసుకోవడం ఎంత కష్టమో వాడి వయస్సు తెలుసుకోవడం అంతకష్టం ఎప్పుడు చూచినా. అదే వాలిన వడుం, అదే బోసినోరు, అవే బురుగు మీసాలు అదే దర్పపూరితమైన గొంతుక కాలం వాడిముందు "హతోస్మి" అన్నట్టు ఉంటాడు

"నీకు ఎన్నిఏళ్లు తాతా!" అని ఎవరైనా ప్రశ్నిస్తే—

"నేను మునలోణ్ణా" అంటాడు

"అదికాదు ఎన్ని ఏళ్ళని"

"మహబూబు ఆలీ రాజుకాలంలో యింత వాణ్ణి నేను"

"నీకు ఎట్లాతెలుసు?"

"అప్పుడు యిన్ని ఊళ్లు, యింత జనం ఎక్కడిది? అంతా పెద్ద అడవి! రాజు షికారుకువస్తే పులుల తోలడానికని, యిళ్ళకు తడకలు కట్టించి, పురుగు లేకుండా తోలుక పొయ్యేది"

వానివి కదిలిస్తేచాలు. తనబాల్యంనాటిగాథలన్ని ఏకరువు పెడుతాడు ప్రస్తుతానికి వాడిని కదపకుండానే ముందుకు వెళ్ళిపోదాము.

అదిగో! చూడండి. పిల్లల అరవులతో ప్రతిధ్వనిస్తు ఉన్న ఆ పూరిగుడిసె మా ఊరు బడి! పిల్లల దిక్కు వీపు ఉంచి చాప అల్లుతూ మధ్య మధ్య పిల్లల హెచ్చరిస్తూ నిమిషానికో తడవ నశ్యం పీల్చుతు ఉన్న ఆ జీమూతవర్ణుడే మా ఊరు పంతులు నిమిషానికోతడవ నశ్యం వేయంది బహుముఖాల పనిచేసే ఆతని మనస్సు హుషారుగా ఉండదు. చాప అల్లుతూనే ఉంటాడు. తప్పుపోయినచోట "అరేయి" అని పిల్లల హెచ్చరిస్తూనే ఉంటాడు "ఈకాగితంచూడు పంతులు" అని వచ్చినవాళ్ళకు ఆకాగితమేదోచూచి పంపుతూ ఉంటాడు ఎన్నో విషయాల్లో ప్రవేశముంది మా ఊరిపంతులుకు. ప్రశ్నలు చెబుతాడు జాతకాలు రాస్తాడు. ముహూర్తాలు పెడతాడు. యిళ్ళముగ్గు పోస్తాడు. రోగులకు ఔషధ సహాయం చేస్తాడు. ఎడతెగని ఈ కార్యకలాపాల మూలాన సాధారణంగా పిల్లల చదువు కుంటుపడుతూ ఉంటుంది. కాని ఊరివాళ్ళ దృష్టిలో ఎప్పుడో ఫలితాన్ని యిచ్చే పిల్లలచదువుకన్న వాళ్ళ తాత్కాలిక అవసరాలే ప్రాముఖ్యత వహిస్తాయి తమ తక్షణావసరాలముందు రేపటి ప్రయోజనాన్ని వాళ్లు అంతగా లెక్కచేయరు అది ఎంతవరకు పోయిందంటే ఆతనో సర్కారు ఉద్యోగి అనే విషయంకూడా వాళ్ళు విస్మరించారు పదేళ్ళ క్రితం తొట్టతొలిసారి మా గ్రామం సర్కారిబడి వచ్చినవుడు, యిదివరకు వీధిబడిగా ఉన్న మా ఊరు బడిని, కరణం సహాయంతో, సర్కారిబడిగా చేయించుకున్నాడు మా పంతులు. ప్రతిరోజు తెల్లవారుజామున అక్షయపాత్ర తీసుకొని అట్లా ఓపది యిళ్లు తిరిగి జామప్రొద్దుకు బడికి చేరు

ఉంటాడు కాని ఆ మరునిమిషమే ఎవరో ఒకరువచ్చి అతనిపనికి అంతరాయం కలిగిస్తారు.

ఒకసారి విద్యాశాఖాధికారి ఒకడు తాను ఫలానా తేదీ తన గ్రామం రాబోతున్నానని తెలిపి సరిగా ఆదేరోజు బడికి వచ్చాడు ఊరిబయట పంతులు తనకొరకు కాచుక కూర్చుంటాడని, భ్రాంతిపడ్డ విద్యాశాఖాధికారికి పెద్ద నిరాశ అయింది బడిలోకూడా లేడు పంతులు. పంతులు లేకపోవడంచూచి, పంతులు కొడలో పిల్లల్ని అటు యిటు తరిమాడు చాలసేపటికి పంతులును వెతికి తీసుక వచ్చారు పిల్లలు

"నేను యివాళ బడికి రాబోతున్నాననే సంగతి నీకు తెలియదా?" అధికారి కోపంతో ప్రశ్నించాడు.

"అయ్యా! తెలుసు"

"బడిలో ఎందుకు హాజరు లేవు?"

"ఒక బాలెంతరాలుకు శరణం వచ్చిందని వాళ్ళ యింటివాళ్లు వచ్చి ఏడుస్తూ ఉంటే వెంబడే వద్దామని పోయినా"

"నీకు జాతకాలు, ముహూర్తాలు యిదే పని అని విన్నాను నీవు ఉద్యోగానికి అనర్హునివి"

పంతులు జవాబు చెప్పకుండా యింటిలోపలికిపోయి దప్తరం అక్షయపాత్ర రెండుతెచ్చి అధికారిముందు పెట్టాడు

"యివేమిటి?" అన్నాడు అధికారి.

"అది మీది" అన్నాడు దప్తరం చూపుతు

"యిదేమిటి?"

"ఇది నాది" అన్నాడు అక్షయపాత్రి చూపుతు,

"హూ" అని హూంకరించాడు అధికారి అంతే! యిక మాట వెళ్ళలేదు పంతులు పదవినుండి తొలగించడం అంత తేలిక అయిందికాదని అతనికి తెలుసు ఎందుకంటె ఊరివాళ్ళ జీవితములోని అన్నిరంగాల్లో పెనవేసుకొన్నాడు ఆయన. మరొ కొత్తవాడిని పంపినా ఆ ఊరిలో పలకరించెవాడె ఉండడు. యిక ఏవో కొన్ని హితవాక్యాలు పలికి వచ్చిన దారి అనుసరించాడు అధికారి

మా పంతులు బహు కుటుంబీకుడు ఉద్యోగము, భిక్షాటన రెండుకూడా. అతని అవసరాలకు సరిపోవు కాని మనిషి ఎన్ని చిక్కుల్లో ఉన్నా ప్రశాంతంగా ఉంటాడు

"ఏమిటి పంతులు, ఎట్లా గడుస్తున్నది" అంటె

"మీ దయవల్ల యిప్పటికి ఏలోటులేదు" అని ప్రసన్నవదనంతో అంటాడు.

మా పంతులుకు యివాళ రేపటి చదువు సంధ్యలపైన విశ్వాసంలేదు " ఏమిచదువులివి? యిల్లు గుల్లచేసే చదువులు. ఏదో వ్యవహారపూర్తి విద్యనేరిస్తేచాలు" అని అతని మతం తన దగ్గరచదువుకునె పిల్లల కూడా అట్లాగే తయారుచేస్తూఉంటాడు.

మా పంతులుగూర్చి వివరంగా చెప్పాలంటె పెద్ద భారతమవుతుంది ప్రస్తుతానికి క్లుప్తంగా ముగించి ముందుకు పోతాము.

అదిగో! అ కనిపించె మట్టిబంగళా మా ఊరు కరణంది. మా ఊరు దొర. కరణం, పటేలు అన్ని పదవులు ఈయనవే కాని ఆ పదవులన్ని నామమాత్రములే పూర్వవైభవానికిచిహ్నంగా మట్టిబంగళా ఒకటిమాత్రము మిగిలి ఉంది అది అయినా పట్టణంలో ఓ మార్వాడికి తనఖాపడివుంది. వాడు

ఎన్నోసార్లు వేలం వేయించడానికి ప్రయత్నం చేశాడు కాని ఊరివాళ్ళలో ఏ ఒకడు ముందుకు రాకపోవడం మూలాన విసిగి, కరణానికేని వదిలి వేశాడు దానిని "ఈ మట్టి చాలా గట్టిది" అని అప్పుడప్పుడు కరణం తన బంగళా వ్యవహారం గూర్చి ఊరివాళ్లతో హాస్యధోరణిలో అంటువుంటాడు కాని అంత కన్న గట్టివాడు మా ఊరికరణం మా కరణం యింటిలో ఆ పూటకు ఉండవు కాని ఊరిలో నిత్యం జరుగుతుండె మామూలు తగాదాల్లో పెత్తనం వహించి తన అవసరాల వెళ్లతీసుకుంటు ఉంటాడు ఊరిలోని సర్వేనెంబర్లు, హద్దురాళ్లు, నీటికాలవలు, గ్రామమార్గాలు, యివన్ని అతనికి అరచేతిలోని రేఖల మోస్తరు పూర్తిపరిచయం. ఈ విజ్ఞానాన్ని అతను సందర్భానుసారంగా ఉపయోగించుకుంటు ఉంటాడు నీ భూమి పక్కకొండలో కలిసిందని, బళ్లబాట పక్కభూమిలోనుంచి పుట్టిస్తానని, పోరంబోకు పట్టా యిప్పిస్తానని, ఆశలుపుట్టించి, భ్రమలుకల్పించి, ఆవేశకు అవసరముపూర్తి సంపాదించుకుంటాడు కాని మంచిరోజుల్లో, దుబారా ఖర్చుకు, భోగాలకు అలవాటుపడ్డ, ఆ కుటుంబానికి ఆ సంపాదన, ఎండి బీటలువారిన భూమిమీద వానజల్లు పడ్డట్టు ఉంటుంది దాహం తగ్గించడానికి బదులు యినుమడింపచేస్తుంది. యిక అవసరాల ఒత్తిడికి తట్టుకోలేక రోజు ఏదో ఉపాయము పన్నవలసివస్తుంది ఊరి భోగట్టా ఎప్పటికప్పుడు అందించె కొందరు నమ్మికబంట్లు ఉన్నారు మా కరణానికి వాళ్ల ఎవరింట ధాన్యమున్నది, ఎవరిచేతికి డబ్బులు వచ్చినవి అవి ఏవిధంగా లభించేవి, ఈలాటి విషయాల్లో కరణానికి సలహాలు యిస్తువుంటారు. యిక చేబదులో, ఋణమో, యింట బంధువులు వచ్చినారనె తొందరో, ఏదోరూపంగా, పాడిని కరిగించి తన అవసరాన్ని వెళ్ళతీసుకుంటాడు. అవసరంపెట్ల తల తాకట్టుపెట్టడానికి గూడా వెనుతీయడు కాని డబ్బు చేతిలోపడ్డ మరుక్షణం ఆ విషయమే అతనికి స్మృతివుండదు తలవెంట్రుకలన్ని బాకీలున్నాయి మా ఎంతులకు, రోజు ఎవరో ఒకరు వచ్చిపోతువుంటారు కాని మా ఎంతులు నిబ్బరం శ్లాఘాపాత్రమైనది ఋణదాతకు డబ్బుగూర్చి అడిగె అవకాశమె యివ్వడు ఎవరో ఆప్తబంధువులు వచ్చినట్లు, కాఫీ, ఫలహారాలు, యిష్టమృష్టాన్నాలు యిలాటివాటితో ముంచెత్తుతాడు. ఒకవేళ ఎవడైనా అప్పటికి అడగటానికి సాహసించినా, తెల్లవారె పంపిస్తానని ధైర్యంగా అంటాడు వాడికిదంతా వట్టి అబద్ధమని తెలుసు, కానినమ్ముతాడు వాడుమెక్కిన పదార్థాల ప్రభావం వాడిపై యింత గాఢంగా ఉంటుందంటే వాడికి కాదనడానికి అవకాశముండదు కరణము పుట్టుపూర్వోత్తరాలు ఎరిగినవాళ్లు గూడా చాలామంది గోతిలో పడ్డారు యింతకు మా కరణంలో విశేషమేమిటంటే అతనిమనోనిబ్బరము ఎటువంటి సంకటస్థితిలో గూడా చలించదు ఒకసారి మరి తమాషచేశాడు, ఎట్లా వలలోవేసుకున్నాడో వేసుకున్నాడు ఒక పట్టణం షాహుకారును వాడికేమి చెప్పాడో తననుగూర్చి, ఓరోజు వాడిని వెంటతీసుకొని వచ్చి 'ఈ పొలమంతా మనదే' అని చెఱువుక్రింద ఉన్న రైతుల పొలాలన్ని పెద్ద గీతగీసి చూపెట్టాడు. పంటలమీద ధాన్యం కొలిచె అట్లు తక్షణం అతనికి కోరినఋణం దొరికింది కాని కళ్లాల తరుణంలో వచ్చిచూచెవరకు సర్వంశూన్యంగా

ఉంది ఊరి రైతులు ఎవడిఎకరం వాడు కోసు కొని గడ్డిపోచ కనిపించకుండా మోసుక పోయారు యిక ఆ షాహుకారువద్ద మనో వేదన యింతంతకాదు షాహుకారు హంగా మానుండి బయటపడటానికి కొంత ఋణం అప్పుడు చెల్లించాడనుకోండి కాని మిగతా ఋణం ఈ నాటివరకూ అట్టాగేవుంది యిష్ట మృష్టాన్నాలు తుడవడం, కులాసాగా కాలం గడపడం యివే మా పంతులు లక్ష్యాలు పైకి అమాయకుడుగా కనఎడుతాడు కాని కరణం తరవాత కరణమంతవాడు మా ఊరు షాహుకారు ఏదో తన వ్యవహారం తప్ప యితరులకు సంబంధించిన వ్యవహారాల్లో ఆ ప్రైజోక్యం తీసుకోడు అందరి కష్టసుఖాలతో సంబంధం ఉన్నట్టుగానె కనఎడుతాడు కాని తామరాకు మీది నీటిబొట్టు చందంగా ఉంటాడు జీవితము సుఖప్రదంగా గడపాలంటె ఎవరితో విభేదం కనపరచకుండా వ్యవహరించడమే ఉత్తమ మార్గమని అతని ఉద్దేశం

"ఏమిటి? నాగయ్యా! ఈ ఏడు కాలం పొయ్యే అట్టు కిసపడుతుంది" అంటామనుకోండి

" పొయ్యే అట్టే కనఎడుతున్నది. " అంటాడు

"యిప్పటికి కురిసినా పరవాలేదు "

"వర్షాలు వెనక అయితే తెగుళ్లు లేస్తవేమొ"

"తెగుళ్ల లేస్తవి."

"అయినా బలాలువేసిన పొలాలకు పరవాలేదు"

"బలాలువేసిన పొలాలకు పరవాలేదు."

"కాని ఏమి పండినా ఏమిలాభం! ధరలు పోయినంక "

"ధరలు పోయినంక ఏమిలాభం."

"వీరుటికి ఈఏటికికొద్దిగా వయమేధరలు".

"కొద్దిగా వయమే".

ఈ రకంగా ఉంటుంది అతని ధోరణి.

అయితే అతనికి స్వంత అభిప్రాయాలు లేవనికాదు భూమిలోని ప్రతి వస్తువగూర్చి అతనికి నిశ్చితమైన అభిప్రాయాలున్నాయి. కాని సాధారణంగా నోట విసపడవు

కరణం అంటే ఎంతో భయభక్తులు కన బరుస్తాడు కాని లోపల "అంత కాలాంతకుడు లేడు" అని తనదగ్గరి అసామీలతో అంటు ఉంటాడు

బడిపంతులును "యిందుగల డందులేడని" సంబోధిస్తు ఉంటాడు.

ఎలవాడు తనకు కనిపించినప్పుడెల్ల "కాశి శరీరమంటే పీదేరా?" అని ఒక ప్రశంసా వాక్యం విసురుతుంటాడు.

యింటిచాకలిదానిని "మహిషాక్షి" అని సంబోధిస్తు ఉంటాడు ఎందుకంటే అది నోరు విప్పితె యింటిపెంకులు ఎగిరిపోతాయి

అసామీలు, ఋణాలు, యివే మాషాహుకారుకు ఆసక్తిగల విషయాలు. కాని మా షాహుకారుదగ్గర ఋణము తీసుకోవడము. ఋణము తీసుకున్నట్టుగా ఉండదు. ఒక కొత్త చుట్టరికం కలిగినట్టుగా ఉంటుంది. కాని ఆ చుట్టరికం లభించడము తేలికగాదు. షాహుకారు నిశితపరీక్షకు నిలవకలిగిన వాళ్ళకే ఆ భాగ్యము లభిస్తుంది.

కొన్ని కుటుంబాలకు అనాదినుంచి షాహుకారు వంశస్థులే పెట్టుబడిదారులు. వాళ్ళ యిళ్ళల్లో షాహుకారు కేవలం ఋణదాతయే కాదు గురుడు, దైవము, పభుడుగూడా. ఆ యిళ్ళల్లో చుట్టాన్ని మరోపూట ఉండ

మనటానికిగూడా షాహుకారు ఏమంటాడో అని ఆలోచించవలసి వస్తుంది

ఊరునిండా మా షాహుకారుకు బాకీదారులున్నారు కాని ఒక బాకీదారు సంగతి ఒక బాకీదారుకు తెలియదు పక్కవాడికి తెలియకుండా ఋణమివ్వడం, నొప్పించకుండా తీసుకోవడం యివే మా షాహుకారు లక్ష్యాలు

గ్రామానికి వెన్నెముకలాంటివాళ్ళను మీకు చూపెట్టాను యిక సాధారణ గ్రామప్రజల గూర్చి ఒకటిరెండు ముక్కలు చెపుతాను

మామూలుగా గ్రామీణమనస్తత్వమనేది ఒకటి ఉంది అది గ్రామాల్లో నివసించే వాళ్ళందరికి ధనిక, పేద, భేదం లేకుండా వర్తిస్తుంది సాధారణ గ్రామీణుడు ఒక పద్ధతిలో ఆలోచిస్తాడు

వాడి పొలమే వాడి సామ్రాజ్యం

వాడి పూరిగుడిసే వాడి కోట

వాడి నివాసగ్రామమే ప్రపంచానికి కేంద్రం

తాను దున్నే కొయ్యనాగలి ఒకటే వ్యవసాయానికి అత్యుత్తమ సాధనం.

తానతోలే ఎద్దుల మోటే, నీరు తోడడానికి నివర్లైన సాధనం

తాను అవలంబించే వ్యవసాయ పద్ధతుల కన్న అభివృద్ధిచెందిన పద్ధతులు ఎట్లా ఉంటాయో వాడి ఊహకు అతీతాలు.

పైర్లవేయడం వాడి నిత్యకార్యం

ఋణమొకటే బ్రతుకుమార్గం.

షాహుకారు బాకీ తీర్చడమే వాడి జీవిత లక్ష్యం

అతివృష్టి అనావృష్టికన్న వాడికి యితర చింత లేమి ఉండవు

కళ్ళాలవేళకన్న వాడికి వేరే పండగలుండవు

శిస్తు చెల్లించేదానికన్న యితర గండాలేమిటో వానికి తెలియవు.

గతము వాడికొక దుస్స్వప్నము

వర్తమానము బాధాకరము.

భవిష్యత్తు ఒకటే వాడికి ఆశాజనకం

వాడికి ఎప్పుడు ఏవో సమస్యలు ఉండనే ఉంటాయి

కాని ఏఏటి కాఏడు, వర్షాలు చక్కగా కురుస్తాయని, పంటలు చక్కగా పండుతాయని ఋణాలు తీరుతాయని—— యిలాటి స్వప్నాలు కంటు ఉంటాడు వాడు.

కష్టాలు విస్మరించడము, సుఖాలకు ఎదిరిచూడడం వాడి నైజ స్వభావం ఒకవేళ యిదే మానవలక్షణమైతే పట్టణవాసులు పల్లెవాసులు అనే విభేదం కేవలం కృత్రిమము అని తోస్తుంది

మీ రేమంటారు ?

అవునంటారా ?

* * *



గేయం:

# పాపల సింగారం

—శ్రీ నండూరి వెంకట సుబ్బారావు

చిదుమ పాలొలుకు మా చిటి పాప నేడు
చేపట్టె వరువి చేదోడు వాదోడు
కాటుకలు, తిలకాలు
కంఠాన హారాలు
పైరుగాలికి తోట
పాపజత పయనాలు!
చిదుమ పాలొలుకు ...

విడివడని చెయిచేయి
వెరపు - చనవులు వేయి
మనసుతెలుపు విటూర్పు
"మన"కు "నీ—నా" మార్పు
చిదుమ పాలొలుకు

పూచాలు కిరువైపు
పోచాటు - రానీటు,
చెవి గుసగుసల వింత
చెంపలకె గిలిగింత!
చిదుమ పాలొలుకు .

సఖుడు పచికను పండ
సరస సఖి కూర్చుండి
శిరసువాల్చెదు తంతు
సురలోకమె "తథాస్తు"
చిదుమ పాలొలుకు....

దూరాన ఎంకి మది దుందుడుకు లెఱుగు
తీరానె తుళ్ళిపడు యేరేమి యెరుగు?
ఎట నేరిచెనొ ఏమొ-
ఎటు నేరిచెనొ పాప
ఇన్ని సింగారాలు!

కథానిక ·

# వ్యత్యాసం

—శ్రీ సామవేదం జానకిరామశాస్త్రి

సత్యమూర్తి ఆఫీసునుంచి తిరుగుముఖం పట్టేటప్పటికి ఐదుగంటలు దాటింది  దినదిన గండంగా తయారయిన తన ఉద్యోగాన్నిగూర్చి ఆలోచిస్తూ అతను నడకసాగించాడు  ఒక పక్క. సముద్ర తరంగాల్లా పరంపరగా వస్తున్న ఆలోచనలను మనస్సులోనే అణచి పెట్టు కుంటూ, వేరొకపక్క శరవేగంతో సాగిపోయే రిక్షాలు, జట్కాలు, మొదలయిన ప్రయాణ సాధనాల దారి కడ్డంరాకుండా నడవడం అతనికి అవధానం చెయ్యటమే ననిపించింది  ఐనా ఇలాంటి అష్టావధానాలకూ, శతావధానాలకూ అలవాటుపడ్డవాడు కావటంచేత, అతని కాళ్లు నడవటంలో నిమగ్నమైనా  అతని మనస్సుమాత్రం ఆలోచిస్తూనే ఉంది. ఉదయం ఆఫీసుకి ఆలస్యంగా వెళ్ళినప్పుడు ఆఫీసర్ అన్నమాటలు అతని చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నయ్  ఇవాళ ఒక్కరోజనే ఏమిటి? గడచిన వారం రోజులుగా ఇలాంటి చివాట్లు తినటం, అతని దైనిక కార్యక్రమంలో ఒక భాగంగా తయారయింది. "ఇక ముందునుంచైనా జాగ్రత్తపడకపోతే లాభంలేదు" అనుకున్నాడు  ఈమాటలైతే తేలికగా అనుకోవటం జరిగింది గాని, దాన్ని ఆచరణలో పెట్టటమెలా? ఈ సందేహం సత్యమూర్తి మనస్సుని నిలదీసి ప్రశ్నించింది  ఈ ప్రశ్నకు సరియైన సమాధానం దొరక్కపోవటంతో, అతని మనస్సు ఒక్కసారిగా ఈ స్థితికి కారణభూతమైన సంఘటనలను నెమరువెయ్యటం మొదలు పెట్టింది.

* * *

అతిస్వల్పమైన  విషయంమీద  సుశీల కోపగించి పుట్టింటికి  వెళ్ళిపోవటం  అతని మనస్సుకి చాలా బాధకలిగించింది. సంవత్సరంనుంచీ కాపురంచేస్తున్నా ఈమాత్రం తెలుసుకో లేని ఆమె అజ్ఞానానికి అతను విస్మయపడ్డాడు  'సంసారం' అన్నతరువాత అనేక కష్టనష్టాలు ఉంటూనే ఉంటయ్  అన్నింటినీ అధిగమించి ఏదోవిధంగా ఈదుకురావాలిగాని ప్రతివిషయం పట్టించుకుంటే ఎట్లా? ఐనా తనమాత్రం ఏంచేశాడు గనుక? ఆమె సినిమాకు వెళ్దామంది. దానికి తనువ్యతిరేకించకపోగా తక్షణం అంగీకరించాడు  ఐతే అదిఆచరణలో పెట్టటంలోకొంత ఆలస్యం జరిగినమాట వాస్తవమే  ప్రతిరోజూ ఏదో అనుకోనిపనిరావటం - తను ఆఫీసునుంచి ఆలస్యంగా ఇంటికిరావటం ఈవిధంగా మూడు, నాలుగు రోజులు గడచిపోయాయి ఈ మూడు నాలుగురోజులూ ఆమె ముస్తాబై సిద్ధంగా ఉంటూనే ఉంది  ఐతేమాత్రం తను కావాలని ఆలస్యం చేస్తేగా? నాలుగోనాడు సుశీల ఓపికపట్టలేక పోయింది. అక్కడికీ తను అనేక సార్లు చెప్పాడు  "అన్నంతినేటప్పుడు ఇలాంటి విషయాలు తీసుకరావద్దని." అతనేదైతే చెప్పాడో ఆమె దాన్ని సరిగ్గా వ్యతిరేకించింది  అసలే ఆకలితో ఉన్నాడేమో, మాట, మాట పెరగటం, తను కొంచెం చెయ్యి జేసుకోవటం జరిగింది  అంతే - ఆవాళ ఇద్దరూ ఆకలితోనే పడుకున్నారు. ఉదయం ఆమెతో మాట్లాడనైనా మాట్లాడకుండా అతను ఆఫీసుకి వచ్చేశాడు.

తిరిగి వెళ్ళేటప్పటికి ఇంటికి తాళం వేసిఉంది ఆమె సినిమాకు వెళ్ళి ఉంటుందనుకున్నాడు. పక్కింటివాళ్ళ అమ్మాయి కమల వచ్చి తాళంచెవులు ఇస్తూ, "పిన్ని పుట్టింటికి వెళ్ళింది బాబాయ్" అంది ఈమాటలు విన్న సత్యమూర్తి తన చెవులను తాను నమ్మలేకపోయాడు. ఈ సంఘటన అతన్ని తీవ్రంగా గాయపరచింది ఇంకో పరిస్థితులలో ఐతే తనుకూడా సెలవు పెట్టి బయల్దేరేవాడేమో ! కాని ఇది ఆత్మాభిమానానికి సంబంధించిన సమస్య తనేమాత్రం పొరపాటుచేసినా, ఆమెదృష్టిలో చులకనైపోవటం తథ్యం. ఐనా ఇంటిదగ్గర ఆమె ఎన్నాళ్లుంటుంది గనక, రెండు రోజుల్లో తిరిగి రానేవస్తుంది ఈ రెండురోజులూ అతను స్వహస్తానికి దిగవలసివచ్చినా ఆమెకు ఒక గుణపాఠం నేర్పాలనుకున్నాడు ఇలా అనుకున్న సత్యమూర్తికి తెలియకుండానే వారంరోజులు దొర్లిపోయాయ్ ప్రతిరోజూ ఎదురుచూడటం, ఆమె రాకపోవటంతో అతనికి కోపం ఎక్కువైంది. ఈవారంరోజులూ అన్నం వండుకుని, తిని ఆఫీసుకు వెళ్ళేటప్పటికి తలప్రాణం తోకకి వచ్చేది ఈవారంలో ఒక్కరోజుకూడా అతను ఆఫీసుకి టైముకి వెళ్ళినపాపాన పోలేదు "ఇంక ఏమాత్రం ఆలస్యం జరిగినా ఉద్యోగం ఊడటం ఖాయం" అనుకున్నాడు ఇలాంటి ఆలోచనలతో నడుస్తూ సత్యమూర్తి అతనికి తెలియకుండానే పూలదుకాణం దగ్గరికి వచ్చేశాడు "పూలు పుచ్చుకోరు బాబూ ! బాబుగారు పూలుకొని వారం దాటింది" అన్న దుకాణదారుడి మాటలతో సత్యమూర్తి ఈలోకంలో పడ్డాడు ఒక అసంకల్ప ప్రతీకారచర్యలాగా అతనిచెయ్యి జేబులోంచి డబ్బులుతీసి బల్లమీద పెట్టింది దుకాణదారు డిచ్చిన పొట్లం తీసుకొని అతను నడకసాగించాడు పూలైతే కొన్నాడు కాని వాటిని వినియోగపరచే విధానంమాత్రం అతనికి తెలియలేదు. సుశీల జడనిండా పూలు కుట్టుకుంటే చూడాలని అతను అనేకసార్లు ముచ్చట పడ్డాడు ఆమెకు పిల్లలంటే ఇష్టం అందుచేత తను తెచ్చిన పూలల్లో సగం పక్కింటివాళ్ళ కమలకి, ఎదురింటవాళ్ళ విమలకు పంచేది తనకికూడా పిల్లలంటే ఇష్టమే ఐనా సుశీలమీద అనురాగం దాన్ని పైకి రానిచ్చేదికాదు. ఈ దృష్టితోనే అతను అనేకసార్లు ఆమెతో చెప్పాడు, "నేను పూలు తెచ్చేది వాళ్ళకోసం వాళ్ళకోసం కాదు" అని. దానికి ఆమె ఒక చిరునవ్వునవ్వటం మినహా సమాధానం చెప్పేది కాదు. ఈ విధంగా ఆలోచిస్తూ సత్యమూర్తి ఇంటిని సమీపించాడు అతను తాళం తీస్తుండగా ప్రవేశిస్తూనే కమల అడిగింది. "పిన్ని ఎప్పుడొస్తుంది బాబాయ్ ?" సమాధానమేమీ దొరకని సత్యమూర్తి పూల పొట్లం కమలచేతికిస్తూ, "విమలా, నువ్వూ పెట్టుకోండి" అన్నాడు. సంతోషంతో గంతులేస్తూకమల వెళ్ళిపోయింది. సత్యమూర్తి తాళంతీసి లోపల ప్రవేశించాడు.

* * *

బిక్కు బిక్కు మంటున్న ఇంట్లో ప్రవేశిస్తూనే సత్యమూర్తి ఒక నిశ్చయానికి వచ్చాడు. ఇంకేమాత్రం ఆలస్యంచేసినా తన ఉద్యోగం నిలవదు. "పోనీ వెళ్ళి తల్లిని తీసుకువస్తే ?" ఈ ఆలోచన అతనికి బాగానే కనుపించింది. కాని తీరా వచ్చాక ఆవిడ "సుశీల ఏదంటే ?" ఏమిటి చెప్పటం. అంతేకాదు ఆవిడని ఇక్కడికి తీసుకవస్తే ఇంటిదగ్గర ఎలా ? ఈ రెండో ఆలోచన సత్యమూర్తి మొదటి ఆలోచనను పైకి రానివ్వలేదు.

సుశీల ఇంట్లో ఉంచే తన కేవిధమైన లోటూ ఉండేదికాదు ఆమెలేనిలోపం ఇప్పు డతనికి అనుక్షణం కనిపిస్తోంది ఒక్కసారి సత్యమూర్తి మనస్సు గతంలోకి ప్రయాణం చేసింది. తనని విడచిపెట్టి పుట్టింటికి వెళ్లేటప్పుడు ఆమె కనుకొలకుల్లో ఉన్న అశ్రుబిందువు లను పైకి రానీయకుండా గద్గదస్వరంతో తన దగ్గర సెలవుతీసుకున్న ఘట్టం ఒకటి అతనికి జ్ఞప్తికొచ్చింది ఆలోచిస్తూనే సత్యమూర్తి వంటగది దగ్గరకు రావటం, ఆగది తలుపుతీసి ఉండటం గమనించటం జరిగింది. సుశీల ఇంట్లో ఉంచే రాత్రిళ్ళు తలుపులు గడియపెట్టటం మొదలయిన పనులన్నీ ఆమె చూసుకునేది పొద్దున తన ఆఫీసు తొందరలో తలుపువేయటం మరచిపోయాడు ఇంకానయం ఇంట్లో ఎవరూ ప్రవేశించలేదు క్షణక్షణానికి సుశీలను తిరిగి తీసుకరావాలనే అభిప్రాయం అతనికి బలపడసాగింది ఒకసారి ఈ అభిప్రాయం మనస్సులో కలిగాక అతని మనస్సు ఈ నూతన దృక్పథంలోనుంచి గతాన్ని పునర్విచారణ చేయటం మొదలు పెట్టింది సుశీల కాపురానికి వచ్చి ఏడాదైనా నిండనేలేదు అలాంటి పరిస్థితుల్లో సాంసారికమైన విషయాలలో ఆమె ఆరిందాగా ప్రవర్తించలేదంటే ఆమె తప్పేముంది? అక్కడికీ ఆమె నాలుగు రోజులు ఓపిక పట్టింది ఎంతవాళ్ళకైనా ఒకస్థితి దాటాక ఓర్పు అనేది నశించటం సహజం అమాటకొస్తే తనుమాత్రం చేసిందేమిటి? మర్యాదగా, లాలనగా చెప్పటంపోయి చెయ్యి చేసుకున్నాడు ఆ అధికారం తన కెవరిచ్చారు? ఈ దృష్టితో ఆలో చించిన సత్యమూర్తికి మర్నాడు బయలుదేరి భార్యను తీసుకరావటం తక్షణ కర్తవ్యంగా తోచింది మర్నాడు ఆదివారంకావటం ఈ అభిప్రాయాన్ని మరింతగా బలపరిచింది ఈ నిశ్చ యానికి రావటంతో అతనిమనస్సు తేలికపడింది ఈ సంతోషంతో భోజనంకూడా చేయాలని పించక తలుపులు దిగించి బైటకు వచ్చాడు ఏ ఆలోచనాలేకపోవటంవల్ల. బైట జరుగుతున్న రణగుణ ధ్వని తీవ్రంగా ఆకర్షించింది అతను బయటకుపోయి చూశాడు అప్పుడే ముగియ బోతున్న ఆ రామరావణ యుద్ధానికి కారణం తనేననే ఊహ కలగటంతో అతనికి ఒకవిధమైన ఆశ్చర్యం, భయం కలిగింది తను ఇచ్చిన మల్లెపూలల్లో భాగాలు కుదరక పోవటంతో కమ లకీ, విమలకీ మధ్య మొదలయిన చిన్నపోట్లాట వాళ్ళ తల్లులదాకాకూడా పోయి చిలికిచిలికి గాలివానగా తయారయింది ఇంత చిన్నవిషయానికి నాగరకజీవనం గడుపుతున్న ఆస్త్రీలిద్దరూ కొట్టుకునేటంతవరకూ రావటం అతనికి ఆశ్చర్యం కలిగించింది. అంతేకాదు, అభం శుభం తెలి యని ఆ పసిపిల్లల్ని, మృగాలలాగా బాదిన వాళ్ళ మనః ప్రవృత్తికి విచారించుట మినహా అతనేమీ చేయలేక బరువెక్కిన హృదయంతో ఇంట్లో ప్రవేశించాడు.

* * *

ఏమైనాసరే భార్యను తీసుకరావాలనే దృఢ నిశ్చయంతో బయలుదేరిన సత్యమూర్తికి నాలుగడుగులు వేసేటప్పటికి బండిలో సుశీల కనుపించటం అపరిమితమైన ఆశ్చర్యాన్నీ, సంతోషాన్ని కలిగించింది అయినా పైకుబికివస్తున్న సంతోషాన్ని లోపలే అణచిపెట్టుకుంటూ అతను బండిని సమీపించాడు. అతన్ని చూస్తూనే సుశీల మందహాసం చేస్తూ అంది. "ఎక్క డికో బయల్దేరినట్లున్నారు, ఒక్కసారి లోపలకు వచ్చి వెళ్ళండి" అని. అతనికి మనస్సులో

[తరువాయి 19-వ పుటలో]

కవిత:

# కళోపాసకుఁడు

—శ్రీ చొల్లేటి నృసింహశర్మ

గురుగభీర విభావ పరిపూరితంబగు
గగనచుంబి హిమాద్రి గాంచి మనసు
నాదార కెప్పు డానందించు, నక్షత్ర
ఖచితాభ్రవీథిని గాంచి యాత్మ
ఉవ్వెత్తుగాగ బిట్టుప్పొంగు, నుత్తుంగ
కల్లోలవారాశి గాంచియూహ
ఉఱ్ఱూతలూగెడు, నొప్పారు సుమజాత
కమనీయ సురభిని గాంచి మేను
మృదుమధుర మంజులరస ప్రమేయమగుచు
కట్టెదుటనిల్చు బంధుర కవిత గాంచి
ఆత్మ విస్మృతుఁడనయి నేనప్పు డఖిల
సచ్చిదానంద సింధు సంచారినగుదు.

పూలలో లీనమై గాలితాకుడుచేత
తలకొనుచుండు నెత్తావియట్లు
వీణెతంత్రుల డాగి వ్రేలుతాకిడిచేత
తలయెత్తు స్వాదు శబ్దంబుపగిది
తరణుఁడు స్వీయహస్తముల తాకిన తమ్మి
పువ్వున గన్పడు నవ్వులీల
పతికౌగిళుల రాగ మతిశయించుటచేత
మదిపొంగు సాంధ్య సీమంతినియటు
లాత్మ, నందనమున జిగురాకులందు
పవ్వళించిన శ్రీ దివ్యభావ రేఖ
లా కళోపాసకునిలేపి యతని దనిపి
యతుల వాగ్వల్లికలను దూగాడుచుండు.

ఆకుమూకలనుండి యరచాటు మోదుపుగా
సిగ్గుతో తొంగిచూచెదు ఫలములు
సాంద్రవల్లరులందు చక్కఁగా దాగిలి
మూతలాడెదు సుమజాతసరణి
కాంచనకాంతినికాయంబు ముసుగుగా
గైకొన్న శిశిరర్తుకాంత సొబగు
సమలమారుతివీచి కాంతర భాస్వత్ప్ర
సారిత మధుర వీణారవమ్ము

మొయిలుకొనపై తళుక్కున మురిసి మెఱసి
సంచలించెదు తొలకరి చంచలతయు
వింగి, విస్తబ్ధతనుగల్గు విశ్వనంబు
కని, కళాప్రకు హృదయమ్ము కదలిపోవు.

పార్వణ చంద్రబింబంబు ముఖంబున
అద్దమరాతిరి సుద్దపులిమి
దేదీప్యమానమై దివి తేజరిల్లు ప్రా
భాత భానువిపైని పసుపుచల్లి
నిగనిగలాడెదు నగుమోముల గులాబి
సుమము నెన్నుదుట కుంకుమమలంది
చిఱునవ్వుబోలెదు చిన్నారి మల్లియ
సౌరుగంధంబందు నూరవేసి

సహజలావణ్య సౌందర్య సౌష్ఠవముల
కృతకమగు భూషణముల సంకీర్ణపఱచి
మఱుఁగుపెట్టడు; సృష్టి మర్మప్రవృత్త
వివృతుఁడగు కళాశిల్పిఁయందు విశ్వయమ్ముగ.

వలపున మల్లెపూవుల గోసికొనినట్లు
కడుగొని నింగిచుక్కలను ద్రెంపు
రత్నాకరమునుండి రత్నంబులను దీసి
గగనతలంబున గదియనట్లు
మేఘార్భకోపేత మేదినీధరముల
ఉడు గండములను ముద్దిడగఁజేయు
శారద కౌముదిస్నాత రమ్యారామ
ముల శకుంత విహారములనుగూర్చు
స్వీయహృదయాంబుజంబున చిందు భావ
బిందువుల శక్రచాపంబు దిందుపఱచు
సాహితీయోషపై శుభాక్షతలఁ జల్లు
భవ్య ప్రతిభాన్వితుఁడు కళోపాసకుండు.

---

## వ్యత్యాసం [18-వ పుట తరువాయి]

వెళ్ళాలనిపించినా క్షణం వెనక్కి తిరగటంవల్ల భార్యకు లోకువౌతాననే భావంతో వెంటనే అన్నాడు, "అలాకాదు, నాకు అర్జెంటుగా ఆఫీసుపని ఉంది నువ్వువెళ్లు" అని ఈ మాటలని అతను తాళంచెవులు బండిలోకి విసరటం, బండిసాగిపోవటం ఒక్కసారే జరిగింది మాటలైతే అనగలిగాడుగాని అసలు తనకి ఏవంటూ ఉంటేగా? ఏపనీ లేకపోయినా ఇంటికి వెంటనే పోవటానికి మనస్కరించలేదు అదీగాక పని ఉన్నదని భార్యతో అన్నాడాయెను; ఈ ఆలోచనలతో సత్యమూర్తి తనకు తెలియకుండానే నడక మొదలు పెట్టాడు నాలుగు గజాలు నడచిన సత్యమూర్తి ఆశ్చర్యమూ, సంతోషమూ కలిగించే దృశ్యం ఒకటి చూచాడు అది నిన్న సాయంత్రం హోరాహోరీగా పోట్లాడిన పిల్లలిద్దరూ ఏమీ జరగనట్లే ఒకళ్ళభుజాల మీద ఒకళ్ళు చేతులువేసుకొని ఎంతో ఆప్యాయంగా నడవటం—ఈ సంఘటన సత్యమూర్తిని కూడా మనస్తత్వపు పునాదుల దగ్గరకు తీసుకు వెళ్ళి వదలిపెట్టింది ఇంతత్వరగా క్రోధాన్ని, ఆవేశాన్ని మరచిపోగల పిల్లల మనఃప్రవృత్తిని అభినందిస్తూనే అతనమనుకున్నాడు, "ఈబుద్ధి పెద్దవాళ్ళకూ కూడా ఉంటే ఎంత బాగుండును?" ఈ ఆలోచన కలిగీ కలగటంతోనే సత్యమూర్తి ఏదో మరచిపోయినవాడిలా ఇంటివైపుకు తిరిగి నడక సాగించాడు

(ఆంధ్ర విశ్వకళాపరిషత్తు భాషాసమితివారు నిర్వహించిన కథానికలపోటీలో ఈ సంవత్సరం (1955-56) ప్రథమ బహుమతి పొందిన కథానిక.)

ఉబుసుపోక - 2

# కోతలు

—శ్రీ ధరణికోట శ్రీనివాసులు

దాదాపు గంటన్నరనుండి ఆయన లోగడజరిపిన తన కూతురు వివాహ వైభవాల గురించి విపరీతంగా చెప్పుతూవున్నాడు వివాహాల ఏర్పాట్లు, బాజా భజంత్రీలు, పక్వాన్నాలు, ఒకటేమిటి - యింటికివేసిన సున్నం మొదలు విస్తళ్ల కట్టలవరకు చెప్పుతున్నాడు 'ఊ' కొట్టక నాకు తప్పడంలేదు విసుగువచ్చింది ఆయన చాలించడు నాకు కోపం కూడా వచ్చింది యింకా చాలించలేదు ఒళ్లు మండిపోతూంది గత్యంతరం లేక లేచిపోదామని ప్రయత్నిస్తున్నా.

'బ్రాహ్మణ్యానికే దాదాపు యిరువయ్యి పెద్ద డబ్బాలనెయ్యి పట్టిందంటె నమ్మండి' అని ధైర్యంగా కోతకోశాడు ఆయన

నేను భరించలేకపోయినాను మాట్లాడకుండా కూర్చుంటే యింకా ఎన్ని కోతలైనా కోస్తాడని దిగులుపడ్డా 'మీరు నెయ్యికే అంటున్నారా ? మా చెల్లెలు పెళ్ళి సరిగ్గా మీ కూతురుపెళ్ళప్పుడే జరిగింది ఆ పెళ్ళి సంగతులగురించి మీరు వినియుండలేదేమో !' అన్నాను నేను

'లేదు' అని ఆయన మళ్లీ తన ధోరణి సాగించాడు

'అయితే కాస్త వినండిమరి తతిమ్మసంగతులు అలాగుంచి అత్తరు పన్నీరు సంగతి చెప్తాను కనీసం పదిహేను పెద్ద గ్యాసునూనె డబ్బాల అత్తరు పట్టింది' అని నేను ఓ కోతకోశాను

'చంపారు' అంత అత్తరు యెవరికిపెట్టారండీ' అని ఆశ్చర్యంగా అడిగాడు ఆయన

'యింకెవరికి ? మీ యింట్లో యిరువయి డబ్బాల నెయ్యి తాగివచ్చిన ఆ బ్రాహ్మలకే పెట్టాము చేతులకు రాయడమేకాకుండా బుడ్డిచెంబుల్లో నింపి యిచ్చాము' అన్నాను నేను

నా ఎదురుకోతకు చాలా సిగ్గుపడ్డాడు మొహం వెలవెలపోయింది నావద్ద మళ్లీ యెన్నడూ ఆ పెళ్ళిఊసు యెత్తలేదు

అయితే ప్రపంచంలో ప్రతివాడు కాస్తోకూస్తో యథార్థాన్ని సత్యాన్ని మించి మాట్లాడుతుంటాడు. వాటినే మనం కోతలంటాం.

• కోతలు ద్వివిధంబులు 1. సామాన్యం 2 విపరీతం. 'గత సంవత్సరం మా పెరట్లో వంకాయలు బండ్లు కాసినవి నమ్మండి నమ్మకపొండి ఒక్కొక్క కాయ సొరకాయకు మించివుండేది.' అని ఒకాయన కోశాడనుకుందాం

'వంకాయలు బండ్లుకాసినవి' ఇది సామాన్యమైన కోత. పెరట్లో బండ్లకాయలు కాయవు అయినా ఖర్మం, పెరడు పెద్దదయి వుండవచ్చని నమ్మదాం 'ఒక్కొక్క కాయ సొరకాయకు మించివుండేది' యిది విపరీతమైన కోత దీన్ని నమ్మడానికి వీలులేదు

నేను బస్సులో ప్రయాణం చేస్తున్నాను పెన్షన్ పుచ్చుకున్న ఓ పోలీసు ఉద్యోగి అనుకుంటా. కారుచుట్ట కాల్చుకుంటూ తాను ఉద్యోగం చేసేరోజులలో చేసిన వీరోచిత గాధలను ఏకరవు పెడ్తున్నాడు ఒకప్పుడు తాను ఒకే ఒకడు (౪౦) దొంగలు గల గుంపును తరుముతూ మూడురోజులు అడవిలోనే ఉండి వాళ్ళను పట్టుకొని పోలీసు స్టేషన్‌కు తీసుకొచ్చాడట చేతిలో కర్రగూడా పట్టు కెళ్ళలేదట తొందరలో ఆ ఘర్షణలో కాలికి తగిలిన దెబ్బలు అందరికి చూపించాడు గుండ్రంగా ఉన్నాయి ఏనాటి పుండ్లమచ్చలో చెప్పలేం.

'మచ్చలు గుండ్రంగావున్న వే !' అడిగాడు ఆయన పక్కన కూర్చున్న పెద్దమనిషి

'కాదండి మరి తుపాకిగుండ్ల దెబ్బలు యింకా కొన్ని గుండ్లు కాలిలోనే ఉండిపోయినాయి' అంటూ సమాధానం యిచ్చాడు ఆయన కోతలు అందరు నమ్ముతున్నారనే తృప్తిపడ్డాడు

'మా తాత కరణం ఆయన హయాంలో పిట్టలు నీళ్ళు తాగలేదు మీసాలు వడితిరిగినవాళ్లు కూడా యెదురుగా రావడానికి ధైర్యం చెయ్యలేదు' అని మా ఊరి కరణంగారి మనమడు కోతలుకోస్తూ ఆనందం అనుభవిస్తాడు

గొప్ప ఉద్యోగాలపై ఉన్నవాళ్ళను, యెక్కడినుంచో సంబంధాలు కల్పించి, తమ బంధువులని చెప్పుకొనేవాండ్ల కోతలు వినడానికి సొంపుగా ఉంటాయి

'ఫలానా డిపార్టుమెంటు డైరెక్టరుగారు మాకు దగ్గరబంధువు. మా మేనమామభార్య అక్కకూతుర్ని వారి అన్నగారి కొడుకు తోటిఅల్లుని తమ్ముని కిచ్చారు. వారికి పెద్దతోట, అందులో మేడ. స్వర్గంలాగు దివ్యంగా వుంది' ఇత్యాదులు.

ఆడవాళ్లు కోసేకోతలు యింకా తమాషాగావుంటాయి. 'సాయంకాల మైనా మా అబ్బాయి ఆఫీసునుంచిరాడు అసలు వాడు ఒక్కక్షణం ఆఫీసులో లేకుంటే అంతా గందరగోళం అవుతుంది మొన్న నాలుగురోజుల సెలవుమీద ఊరికి వెళితే ఆఫీసువాళ్ళకి యేమీతోచక ఆఫీసు మూసివేసినారట' అని మా పక్కింటి యిల్లాలు ఎన్నోసార్లు చెప్పిందని మా ఆవిడ నాతో చెప్పింది

'మావారు లేకుంటే నాకు తిండి సయించదు యెన్నిరోజులైనా సరె వారు రావలసిందే నేను తినవలసిందే' అని ఒకావిడ చెప్పుకుంటుంటే నేను విన్నాను

పుట్టిల్లు,పుట్టినవూరంటే యెంతో అభిమానం ఆడవాళ్ళకి ఎన్నికోతలైనా కోసేస్తారు కొన్నాళ్ళక్రితం మా యింటికి ఓ దొంగకుక్క వచ్చేది రాత్రిళ్ళు మేము పిచ్చాపాటి మాట్లాడుకొని భోజనానికి వంటయింట్లోకి వెళ్ళేసరికి ఆ కుక్క అన్నం తప్పేల శుభ్రంగా వూడ్చేసి వెళ్లుతుండేది ఓ రోజు మా కనకం జాగ్రత్తగా కనిపెట్టి దానికి యేదైనా ప్రాయశ్చిత్తం చేయనెంచి ఓ పొడుగాటి కర్ర చేతపుచ్చుకొని వంటింటి తలుపుసందున పొంచి నిలుచుండి, సరిగ్గా సమయానికి ఆ కుక్క వచ్చేసరికి ఆవిడ కర్ర చూపించడం, అది గుర్రుమని పైకి రావడం, కర్ర వదిలేసి ఆవిడ యింట్లోకి పారిపోవడం జరిగింది రెండు నిమిషాల వరకు పట్టిన భయాన్ని వదిలించుకొని శ్వాసను బంధించి నాతో ఆ సంగతి చెప్పింది నేను కర్రనందుకొని వెళ్లేసరికి అన్నం తప్పేల శుభ్రం అయ్యి పడివుంది కుక్కమాత్రం కనబడలేదు.

'యింత చండాలపు కుక్కలు మా ఊళ్ళోమాత్రం లేవు ఈ ఊళ్ళోనే తప్ప' అని ఓ కోతకోసింది మా కనకం

చిన్నపిల్లలలో కోతలు మెండు మా పక్కింటి పిల్లలు ఆడుకుంటున్నారు. నేను చూస్తూనేవున్నాను ఆటలల్లో ఏదో కలహం వచ్చింది.

'ఒక్కటి తన్నానంటె గోడవతల పడాలి' అని ఓ అబ్బాయి కోశాడు

'మా అమ్మతోచెప్పి అసలు మీరు ఈ ఊళ్ళోనే లేకుండాచేస్తాను' అని బదులు కోతకోశాడు యింకో అబ్బాయి

కోతలు కోయడం ఈ యుగంలోనేకాక పురాణయుగంలో, ప్రబంధ యుగంలో ఆచారంగా ఉండేది.

తన కుమారుడు ప్రహ్లాదుడు హరిని స్మరించకుండా చెయ్యడానికి యెన్నో హింసలు పెట్టాడు హిరణ్యకశ్యపుడు చివరకు ఈ దిగువ కోతలు కోసి అతన్ని భయపెట్టి మార్గంలోకి తీసుకరావడానికి ప్రయత్నిస్తాడు

సీ అస్మదీయంబగు నాదేశమున గాని
మిక్కిలి రవి మింట మెరయవెరచు
.......... .... ............ ..
అతి తీక్ష్ణమైన నాయాజ్ఞ నుల్లంఘించి,
శమనుండు ప్రాణుల చంపవెరచు
......... ............... ....
గీ ఇంద్రు డౌదల నా మ్రోలలెత్తవెరచు,
నమరకిన్నర గంధర్వ యక్ష విహగ
నాగ విద్యాధరావళి నాకు వెరచు
.......................... (భాగవతం)

కంసరాజు విపరీతంగా కోతలు కోసేవాడు
"ఆకసంబు నరచేతంబట్టెద లోకమెల్ల
నా గదచే మొత్తెద, నాకవాసు డెవడైన
గాని నా పాదంబులచే నణచివైచెదను"
అని కోస్తూనే కృష్ణునిచే హతమైనాడు

కౌరవులు విపరీతంగా కోతలు కోసినట్టు మనకు భారతం చెపుతూవుంది పాండవులు కూడా కొన్ని సందర్భాలలో కోతలు కోయకపోలేదు ఉత్తరుడు సరేసరి ఆయనగారు కోసిన కోతలకు హద్దుపద్దులేదు ప్రాణంమీదికి వచ్చేదాకా అర్జునునితో కోతలు కోస్తునేవచ్చాడు

ప్రబంధాలలో నాయకులు, నాయికలు చేసుకొన్న ఆత్మస్తోత్రాలకు, కోసిన కోతలకు కొలతబద్ద దొరకదు.

కోతకు ప్రతికోత విరుద్ధం, విద్వేషానికి దారితీస్తుందని మొదలే మనవి చేశాను అలాంటి సంఘటన యింకొక్కటి మనవిచేసి ముగిస్తాను

'మా తాతగారికి యెన్ని ఆవులుండేవో చెప్పడం కష్టం వాటికోసం కట్టించిన దొడ్డి చాలా పొడుగుండేదట ఆచివరలోనున్న ఆవులకాపరిని ఈచివర

[తరువాయి 33-వ పుటలో]

నాటిక :

# మహాబోధి

—శ్రీ దాశరథి

**పురుష పాత్రలు**

*బుద్ధుడు*

*ఉపాలి* బుద్ధుడు ఉపాసకుడు

*ఆనందుడు* బుద్ధుని ప్రథమ అనుయాయి

**స్త్రీ పాత్రలు**

*నవ మల్లిక* మన్మథుని కూతురు

*నంద* ఉపాసిక

*(వాయులీనం సన్నని ధ్వని - కాలిగజ్జెల చప్పుడుతో నవమల్లిక నడచి వస్తుంది దూరంనుంచి దగ్గరగా)*

**ఉపాలి** (కొంచెం బిగ్గరగా) ఎవరది ?

**నవమల్లిక** ఇక్కడ బుద్ధులు ఎవరండీ ?

**ఉపాలి** అంతా బుద్ధులమే

**నవ** అయితే బోధి వృక్షం ఏదీ ?

**ఉపా** ఈ జేతవనంలో అన్నీ బోధివృక్షాలే

**నవ** అన్నీ బోధివృక్షా లెలా అవుతాయి... అంతా బుద్ధులు...

**ఉపా** (మాటకు అడ్డు వస్తూ) అది అంతే... ఆఁ... నీ వెవరు ?

**నవ** నవమల్లిక

**ఉపా** నవమల్లికే నాటి మన్మథుని నాలుగో బాణంలా వున్నావు

**నవ** మీకేలా తెలిసిందీ ?

**ఉపా** నీ రంగూ రూపూ సరేగాని మన్మథుడికి అసలు నువ్వేమౌతావు ?

**నవ** సాక్షాత్తూ కుమార్తెను... అయితే నేను బాగా అందంగా వున్నానంటారా

**ఉపా** నీ అందం, నీ చందం, ఇక్కడ నీ ఆటలేమీ సాగవు

నవ ఎందుకు సాగవు ?... ఆడనా ? (గజ్జెలు చప్పుడు చేస్తుంది)

ఉపా ఆఁ చాలు చాలు... అదిగో బుద్ధమూర్తి

నవ అయితే, ఆయనకు భయపడతానా ?

ఉపా ఓహో కామక్రోధాల్ని జయించిన తథాగతుడిదగ్గరా నీ గెంతడాలు?

నవ శివుడికంటే గొప్పా, ఆయన ? గుండెకు గురిపెట్టి మా నాన్న పూల బాణం కొట్టేసరికి అమాంతం లొంగిపోయాడు శివుడు

ఉపా అది నిజమే కావచ్చు గాని ఇక్కడ పార్వతి ఏదీ ?

నవ నేనున్నానుగా

ఉపా ఎంతమాట సిద్ధార్థుడి మీదికే వలపు వల విసరడానికి సాహసిస్తున్నావు ?

నవ ఓ లెక్ఖేం ఇంద్రియాల్ని జయించడం ఎవడితరం ? దూరాన్నుంచి కమ్మని కోయిలకూత వినబడి, దగ్గరగా మల్లెపూలపరిమళం పయట కొంగులా రెపరెపలాడి, పక్కగా మకరంద రసం పూల దొన్నెలో తొణికి, ఎదుట నేను (గజ్జెల చప్పుడు) గల్లుగల్లుమని ఆడితే మనసులో అనురాగం పొడవదూ ?

ఉపా అనురాగం అనే అబద్ధాల మాటకు లొంగిపోయేంత అబలమైన మనస్సు కాదు మా బుద్ధమూర్తిది అయినా నీవు యశోధరా దేవి కంటే అందమైనదానివా ?

నవ మీమాటలకేంగానీ... తప్పుకోండి... నన్నుఆయన దగ్గరికివెళ్ళనీండి

ఉపా ఆయన దగ్గరికే కాలి కూలి బూడిదై పోతావు... బతికి బయటపడు

నవ నేను బూడిదైతే నన్ను మించిన మరో నలుగురు ననబోండ్లు... అదిగో... (వాయులీనం సన్నని చప్పుడు... 'ఏమే మల్లికా' అని దూరంనుంచి పిలిచినట్టు ధ్వని... కోకిలకూత).

ఉపా వాళ్ళంతా ఎవళ్లు ?

నవ : నా అక్కలూ, చెల్లెళ్ళూ, వాళ్ళవెంట చిలకలూ, గోర్వంకలూ, కోకిలలూ, వీణలూ, వేణువులూ...

(చిలకలూ, కోకిలలూ, గోర్వంకలూ అన్నప్పుడు వెనకనుంచి పక్షుల చప్పుడు వినిపిస్తుంది వీణలూ, వేణువులూ అన్నప్పుడు వాటి చప్పుళ్లూ సన్నగా వినిపిస్తుంది)

**ఉపా** · ఓహో. మహా సైన్యంలా వుందే.

**నవ** . అదిగో ఆ పక్కన ఎవరో చూచారా ? ఆయన మన్మథస్వామి, మా నాన్న (దూరంనుంచి నవ్వు) ఆయన వదిలిన బాణం గుచ్చుకోని గుండెలేదు ఓడిపోని వీరుడులేడు

**ఉపా** : అయితే ఇప్పుడేమంటావు ?

**నవ** : నన్ను ఒక్కమాటు బుద్ధమూర్తితో మాట్లాడనీండి

**ఉపా** · ఆయన ఆజ్ఞలేందే

**నవ** . నేను వచ్చాననీ, దర్శనానికి ఆరాటపడుతున్నాననీ చెప్పండి

**ఉపా** అయితే క్షణం ఆగు (పాకోళ్ళతో నడచిన చప్పుడు) స్వామీ... స్వామీ...

**బుద్ధుడు** (మెల్లగా, గంభీరంగా) ఎవరూ ?

**ఉపా** · ఉపాలిని స్వామీ

**బుద్ధుడు** . (ఆప్యాయంగా) ఉపాలీ

**ఉపా** స్వామీ.

**బుద్ధుడు** ఏం కావాలి, నాయనా

**ఉపా** · మన్మథుని మహాసైన్యం మన వనం మీద దాడిచేస్తున్నది ప్రభూ కోకిలలు, చిలకలు, వీణలు, వీణాపాణులు......

**బుద్ధుడు** ఆహ్వానించు

**ఉపా** అదేమిటి స్వామీ వనం అంతా అపవిత్రం కాదూ.

**బుద్ధుడు** తృష్ణనూ, రాగాన్నీ జయించిన మనం అపవిత్రం కానంతసేపూ, మన వనం అపవిత్రం కాదు నాయనా

**ఉపా** . వాళ్లు మిమ్మల్ని ఓడించాలని వస్తున్నారు ప్రభూ.

**బుద్ధుడు** ఓడించనీ

**ఉపా** · అదెలా అవుతుంది స్వామీ

**బుద్ధుడు** : బలాబలాలు తేల్చుకుందాం... (గజ్జియల చప్పుడు, వీణల మ్రోత, కోకిలల కూత)

**ఉపా** : అదిగో స్వామీ, నవమల్లిక (దగ్గరగా కాలిగజ్జల చప్పుడు)

**బుద్ధుడు** : మల్లికా.

**నవ** : స్వామీ.

బుద్ధుడు . రా అమ్మా, ఎలా వచ్చావు ?

నవ మీ సుందరాకారం నన్ను మీదాకా లాక్కొచ్చింది ప్రభూ

బుద్ధుడు ఈ సౌందర్యం ఎన్నాళ్లు? ఇవాళ దీర్ఘోపవాసవ్రతం ప్రారంభిస్తు న్నాను నాలుగు నాళ్ళలో శరీరం శుష్కించి, శల్యావశిష్టం అవు తుంది. అప్పుడు అందం అడుగంటి పోతుందమ్మా

నవ మీరు ఉపవాసం చేయవద్దు స్వామీ. మీ వెన్నెలవంటి శరీరం బడలి చీకటిలా నల్లబారిపోతే నేను భరించలేను ప్రభూ

బుద్ధుడు పిచ్చిదానా, మనస్సుకు అందం రావడానికి, శ్వాసబంధనం చేయ బోతున్నానమ్మా అప్పుడు ఈ విశాల వాయుమండలం, నా నెత్తి బద్దలు కొడుతుంది నరాల్లో నెత్తురు బయటికి తంతుంది గుండె పికిలిపోతుంది శరీరం పాలిపోతుంది డొక్క వెన్నెముక నంటు కుంటుంది... అప్పుడు... అప్పుడు... అందం ఎక్కడుంటుంది

నవ మిమ్మల్ని మృత్యు ముఖంలోకి పోనిస్తానా ? మీ పాదాలొత్తుతూ, మీకు మకరందరసం అందిస్తూ, మిమ్మల్ని సేవిస్తూ ఇక్కడే ఉండి పోతాను స్వామీ

బుద్ధుడు వెర్రిదానా (కొంచెం ఆవేశంతో) పునర్జన్మకు కారణభూతమైన వస్తు వును తెలుసుకోడానికి వేలాది జన్మలెత్తాను పశువునైనాను, పక్షి నైనాను, రాజునైనాను, రైతునైనాను ఈ దుఃఖాల మేడను కట్టించేవ్వడో వాణ్ణి పట్టుకోడానికి ఇక్కడికి వచ్చాను. (మరికొంత వేదనాభరిత కంఠంతో) వాడు ఈ జన్మలోనైనా నాకు దొరకడూ? దొరుకుతాడు తప్పక దొరుకుతాడు అప్పుడు వాడి చేతులుకట్టేసి ఈ బాధాసౌధాల్ని బద్దలు కొడతాను అందులోంచి బయటికి పారి పోతాను ఇక్కడే ఈ చెట్టునీడలో ఒక శాంతివేదిక నిర్మిస్తాను. దానిమీద ధర్మాన్ని ప్రతిష్ఠిస్తాను

నవ స్వామీ.

బుద్ధుడు : నన్ను ధ్యాన సమాధిలోకి వెళ్ళిపోనీ.

నవ · వద్దు స్వామీ. నా వంక చూడండి మీ కోసం నా శరీరంలోని అణు వణువూ పొంగివస్తున్నది. ఈ పట్టు వసనాలు పట్టలేక పికిలిపోతు

న్నాయి. మీ పాదాలు ముద్దిడుకోనీండి... ఏదీ... మిమ్మల్ని ఆలింగనం......

ఉపా . స్వామీ... స్వామీ...

నవ అయ్యో... అయ్యో...

ఉపా (గద్గదంగా) స్వామి మూర్ఛపోయారు అదిగో. . అదిగో... ఆయన తలచుట్టూ తేజశ్చక్రం......

నవ అమ్మో. ఎంత వేడి భరించేట్టులేదు... వళ్లు కాలిపోతున్నది.

ఉపా (బిగ్గరగా) దగ్గరగా వెళ్ళకు, కాలిపోతావు అదిగో... అదిగో కాంతి బాణాలు

నవ అయ్యో అవి నాకళ్ళలో గుచ్చుతున్నాయి. బాబో .. భరించలేను.

ఉపా స్వామీ... స్వామీ...

* * *

( పావు నిమిషం జంత్ర సమ్మేళనం )

( ఆనందుడి కుటీరద్వారం వద్ద తలుపు తట్టిన చప్పుడు నంద ప్రవేశిస్తుంది )

నంద ఆనందస్వామీ తలుపు... తలుపు...

ఆనం ఏమి నందా ఇలా వచ్చావు

నంద కొంప మునిగిపోతున్నది స్వామీ శాక్యముని మూర్ఛపోయారు. అంతా ఆయన చనిపోయాడంటున్నారు

ఆనం (నవ్వి) నందా, ఆయన అమరుడు. ఆయన చనిపోవడం ఏమిటమ్మా.

ఆనం (నవ్వి)

ఉపా స్వామి చనిపోతుంటే నవ్వుతారా స్వామీ.

ఆనం అఖిల ప్రాణికోటి దుఃఖానికి అవసానపర దాపురిస్తుంటే సంతోషిస్తు న్నాను

ఉపా అయితే గౌతముడు చనిపోవడం మీకు సంతోషమా ? మీ మన సులో ఎక్కడా దయలేదా ?

ఆనం · దయామయుడు సిద్ధార్థుడు. ఆయన నాకోసం నీకోసం, యావత్ప్రపంచం కోసం శాంతిని అన్వేషిస్తున్నాడు ఆవేశపడకు నాయనా.

ఉపా . ఆయనకు ఏ అపాయం జరిగినా తల పగులగొట్టుకుని చనిపోతాను... పోతాను... పోతాను... (వెళ్ళిన సవ్వడి)

ఆనం వెట్టివాడు... (నవ్వు, తలుపు గడివేసిన చప్పుడు) బుద్ధం శరణం గచ్ఛామి .. బుద్ధం శరణం.. (నంద ప్రవేశం తలుపు తడుతూ)
నంద స్వామీ, బుద్ధమూర్తి ముఖం నిండా చెమట పట్టింది ముఖం పచ్చగా వుంది
ఆనం ఆయన సమాధి వదలి వస్తున్నారు
నంద లేదుస్వామీ కొందరు ఇదివరకే ఆయన చనిపోయాడంటున్నారు, కొందరు తుదిసారి నిట్టూరుస్తున్నా డంటున్నారు, మరి కొందరు...
ఆనం మరికొందరు ఆయన్ని చంపుతామంటున్నారు
నంద అలా అంటారేం స్వామీ
ఆనం ఆయన ఉపవాసం వదిలేస్తున్నట్టున్నారు. వెంటనే వెళ్ళి పాయసం అందియ్యి పో...
నంద మీరు రారా స్వామీ ?
ఆనం నే రాను (తలుపు వేసిన చప్పుడు) ధర్మం శరణం గచ్ఛామి ధర్మం శరణం..
ఉపా (తలుపుకొట్టి) స్వామీ, సిద్ధార్థుడు కళ్ళు తెరచారు ఆయన ముఖం ఎఱ్ఱగా వుంది కొద్దిగా పాయసం పుచ్చుకుంటున్నారు జనం ఆనందం పట్టలేక కన్నీళ్లు రాలుస్తూ నిశ్శబ్దంగా నిలుచునివున్నారు.
ఆనం శరీరాన్ని హింసించడం వల్ల లాభంలేదని ఆయన మనకు బోధిస్తున్నారు
ఉపా ఆయన ఇంకా మాట్లాడ్డం లేదు స్వామీ
ఆనం ఇంకా ఆయన మాట్లాడరు ఆయన చనిపోయారు.
ఉపా అదేమిటిస్వామీ, అమంగళం అలా అంటున్నారు? ఆయన మృత్యువు నుండి బయటపడ్డారు లేచి కూచున్నారు, మాట్లాడుతున్నారు.
ఆనం నీవు గుడ్డివాడవు ఆయన చనిపోయారు ఖడ్గమృగపథం వదిలేశారు
ఉపా మీ మాటలు బోధపడడంలేదు. నాకు భయంగా వుంది.
ఆనం భయానికి అజ్ఞానం కారణం అజ్ఞానాన్ని జయించు
ఉపా నేను బుద్ధుణ్ణి చూడకుండా వుండలేను. పోతాను...
ఆనం ఆయన నీకు కనపడదు సంఘంలో కలిసిపోయారు సంఘం శరణం గచ్ఛామి... సంఘం శరణం... (నంద ప్రవేశిస్తుంది)

నంద స్వామీ, బోధిసత్త్వులు న్యగ్రోధ వృక్షం క్రిందినుంచి అశ్వత్థవృక్షం క్రిందికి వచ్చి కూచున్నారు. ధర్మచక్రముద్రలో ఉన్నారు

ఆనం. ఆయన ఇంక బోధిసత్త్వుడు కాదు బుద్ధుడు. నిజంగా బుద్ధుడు.

నంద స్వామి మాట్లాడుతున్నారు

ఆనం జనం ఏమంటున్నారు.

నంద ఆనందంతో గంతులు వేడుతున్నారు

ఆనం అదిగో, చీకట్లు జారిపోయి వెన్నెలలు పాకుతున్నాయి.

నంద వైశాఖ పూర్ణిమ పరిమళిస్తున్నది.

ఆనం మనసుల్లోని మాలిన్యాలు కడిగివేసి వైరంజరానది లోకంమీద దూకింది (నది పరుగెత్తే చప్పుడు).

నంద. పశులు, మనుషులు పోలేని ఎత్తులకు పోతున్నాయి

ఆనం పోనీ. పదండి సంఘాన్ని చూచివత్తాం.

నంద బుద్ధమూర్తిని చూడ్డానికి రారూ.

ఆనం అతడు వేరే లేడు అతడే సంఘం. ఒంటిగా నడిచే మనిషి తప్పు దారి పట్టే పిలున్నది అందుకోసం అంతా కలిసి నడవాలి ఒకరి కొకరు తోడ్పడాలి ఒకరి కృషిలో ఒకరు సహకరించాలి...సంఘం శరణం గచ్ఛామి... (ఇద్దరూకలిసి...) సంఘం శరణం గచ్ఛామి...

***(పాకోళ్ళతో ఆనందుడు నడుస్తున్న చప్పుడు)***

( జన కోలాహలం... తరువాత నిశ్శబ్దం )

ఆనం స్వామీ, నీవు సంఘానివి. నీ మార్గమే మాకు ఉపాదేయము. ఈ అశేష జనం ఇప్పుడు ఏం చేయాలని మీఅభిప్రాయం

బుద్ధుడు ఈ దుఃఖాల మేడను నిర్మించిన దొంగ దొరికాడు. అదిగో మేడల్ని పగులగొట్టి బయటపడ్డాను. ఈ బోధి వృక్షం క్రింద శాంతివేదిక. మీరూ నేనూ వేరశీ— సంఘం— (ఈ క్రింది పద్యాలు వచనంలా గంభీరంగా చదవాలి)

— ఇది నిర్వాణపథమ్ము, దీని పయి మీ
రెవ్వారు కానిండు మీ
పదముల్ మోపుడు, వర్ణవర్గకుల
సంపత్తేదియున్ దారి న

డ్డదు, దుఃఖాస్పదమైన ఈ భవము
భ్రష్టంబొటకున్ మున్నె అం
బుదమ ట్లార్తుల సేద దీర్పుడు
రుజాభుగ్నప్రపంచంబునన్.
— భ్రమ తొలగుటయే నిర్వా
ణము, సంసారార్ణవంబునంగల దుఃఖాం
ధ్యము తెలిసి జనన మృతి దు
ర్గమచక్రము దాటిరండు, ప్రమదంబొదవున్.
— దుఃఖమునకు తృష్ణ తొలికారణం బౌను
దానిచంపివేయ బూనవలయు,
మంచి వాడవగుము, మంచి గావింపుము,
అంతకన్న మించినట్టి దేని ?
— ఈ ప్రపంచంబునందెన్న డేని గాని
ద్వేషమును ద్వేషమున నిరోధింపలేము,
దానిమాయించుటకు చిరంతనసుఖంబు
నందుటకు కావలయు ప్రేమబంధమొకటి
— నెత్తిపై భారమున్నవానికి విషాదము,
అది తొలగిపోయినపుడు సౌఖ్యమ్ముకలుగు,
ఒక్క పర్యాయ మా భార మూడ్చివేయ
మరల దానిని వహియింప మనసుపోదు
— తృష్ణాగ్ని జిహ్వాకాగ్ర మ
హోష్ణత భరియింపరాకయుండును, తృష్ణా
జిష్ణుడవుకమ్ము, అహింసా
నిష్ణాతతనంది శాంతినిం బడయుమురా.
( అంతా కలిసికట్టుగా త్రిరత్నాలు ఉచ్చరిస్తారు )
బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
*( అలింజియా రేఖియో, మద్రాసు పౌజన్యంతో )*

వ్యాసము :

# మళయాళ సాహిత్యము - 2

—శ్రీ ఆర్. కె. రావు

*లిపులు* ‧ ప్రస్తుతం మళయాళ భాష వ్రాయబడుతూ వున్న లిపి ఉత్పత్తి విషయంలో విభిన్నమైన అభిప్రాయాలున్నవి చాలామంది విద్వాంసులు దేవనాగరి మొదలగు లిపులకు మాతృ స్థానంలో ఉన్న బ్రాహ్మీ లిపిలోనుండి మళయాళం లిపిగూడా వెలువడిందని అభిప్రాయ పడుతున్నారు మళయాళం లిపి యొక్క ఆకారం ప్రకారాలను బట్టి వట్టెళుత్తు (గుండ్రని లిపి) కోలెళుత్తు (పొడవు లిపి) అని పేర్లు ఏర్పడ్డట్లు కనపడుతున్నది మరికొంత మంది విద్వాంసులు వట్టెళుత్తు స్వతంత్ర లిపి అని అభిప్రాయపడుతున్నారు

*వర్ణమాల* మళయాళం వర్ణమాలలో 51 అక్షరాలున్నవి వాటిలో 15 అచ్చులు, 36 హల్లులు దేవనాగరి వర్ణమాలలో వలెనే మళయాళం వర్ణమాలలో గూడా అన్ని ధ్వనులకూ వేరు వేరు చిహ్నాలున్నవి హ్రస్వ "ఎ" ఓ లు శకటరేఫము దేవనాగరిలో లేవు మళయాళం అక్షరాలు గుండ్ర గుండ్రగా చూడటానికి అందంగా ఉంటున్నవి

*మళయాళ సాహిత్యం—కాల విభాగం* దాదాపు పన్నెండు వందల సంవత్సరాల మొత్తం మళయాళ సాహిత్యాన్ని గ్రంథాలలోని భాషా విభేదాన్ని బట్టి వేరు వేరు యుగాలుగా విభజించ వచ్చును హిందీ మొదలగు సాహిత్యాలలో విషయాన్ని బట్టి, సాహిత్య రంగంలో కాల విభాగం చేయబడ్డది మళయాళ సాహిత్యాన్ని ఈ క్రింది విధంగా విభజింప వచ్చును

1 ఆదికాలము (తమిళ ప్రభావకాలము) ప్రారంభంనుండి 1000 క్రీస్తుశకం వరకు

2 మధ్యకాలము (మణిప్రవాళ కాలము) క్రీస్తుశకం 1000 నుండి 1400 వరకు

3 ఆధునిక కాలము (శుద్ధ భాషా కాలము) క్రీ 1400 నుండి ఈనాటి వరకు

*దేశపరిస్థితి* ఏ దేశంలో వెలువడిన సాహిత్యాన్ని చూచినా అది ఆ దేశంలోని సామాన్య జనంయొక్క మనః ప్రవృత్తులను వ్యక్తీకరిస్తూ ఉంటుంది, ఆ మనః ప్రవృత్తులు ఆయా కాలాలనాటి రాజకీయ, సాంఘిక, ధార్మిక విప్లవాలచే ప్రభావితము లవుతూ వుంటవి కనుక ఆయా భాషలలోని సాహిత్యాన్ని గురించి తెలుసుకొనేటందుకు ముందు ఆయా దేశాల చరిత్రను తెలుసు కొనడం అవసరము అయితే మళయాళం దేశ చరిత్ర సరియైనది ఇంతవరకు లభించలేదు లభించిన సామగ్రిని బట్టి చూస్తే క్రీస్తు శకానికి ఎన్నో సంవత్సరాలు పూర్వమే ద్రావిడులు కేరళ దేశంలో నివసించినట్లు కనబడుతున్నది వారిని "నాగులు" అనేవారు కేరళ దేశంలో పాములు ఎక్కువగా ఉండేవట. నాగులు సర్పాలను ఉపాసించే వారు. అందువల్లనే వారికి ఆ పేరు వచ్చి ఉండవచ్చును. ఈనాటి "నాయర్లు" ఆజాతి వారేనని ప్రశస్తి.

ప్రాచీనకాలంలో దక్షిణదేశం ఐదు రాజ్యాలుగా విభక్తమైయుండేది - ఆంధ్ర, కర్ణాటక, చోళ, చేర, పాండ్యదేశములు ఆ ఐదు. వీనిలో కేరళం చేరదేశానికి సంబంధించినది చేర దేశపురాజు "చేరన్" లేక "చేరమాన్" అని పిలవబడేవాడు ఆనాటి చేరదేశపు రాజధాని తిరువంచిక్కుళమ్ అనే పట్టణము ఆ పట్టణము కొచ్చిన్ రాజ్యంలో ఉత్తరంగా కొడుంగల్లూ రుకు దగ్గిరగా ఉన్న "తిరువంచిక్కుళమే" ఈ పట్టణాన్ని గురించి ప్రాచీన తమిళ గ్రంథా లలో వివరంగా వర్ణనలు దొరుకుతున్నవి ప్రాచీన కొడుంగల్లూరు మంచి రేవుపట్టణము. తిరువంచిక్కుళమ్ అంటే నావలు ఆగేచోటు అని అర్థము అంటే ప్రాచీన కాలంలో నౌకా విహారం బాగా జరిగేది అన్నమాట

చేరవంశపు మొదటిరాజు దానశీలి అని ప్రసిద్ధి అతనిపేరు మహాబలి. ఈ వంశపు రాజులు క్రీస్తు పూర్వం నాలుగవ శతాబ్దం వరకు ఉండేవారు వారి పరిపాలన కాలంలో చేర దేశంలో రెండు ముఖ్యమైన పనులు జరిగినవి. ఒకటి ప్రస్తుతమున్న కన్యాకుమారికి నలభై మైళ్లు దక్షిణాన ఉన్నభూమిని సముద్రం మింగివేసింది బ్రాహ్మణులు కేరళంలోనికి రావడం రెండవ పని పరశురాముని నాయకత్వంలో వారు ఈ దేశంలోనికి వచ్చి రాజుగారి అను మతితో ఇక్కడ స్థిరపడిపోయినారు ఈ నాటి నంపూతిరియులకు వారే పూర్వపురుషులు. వీరు సంఖ్యలో తక్కువగాఉన్నా మంచి బుద్ధిశాలురు విద్వాంసులు కొద్దిరోజుల్లోనే ఈబ్రాహ్మణులు కేరళదేశంలోని అందరిమీదా ఆధిపత్యాన్ని సంపాదించినారు ఈ పరదేశస్థులు నెమ్మది నెమ్మదిగా అక్కడ ధర్మగురువు లైనారు

కేరళదేశంలో లభించిన ఆధారాలనుబట్టి చూస్తే క్రీస్తుపూర్వం 101 వరకు ప్రజాస్వామ్య వ్యవస్థ ఉన్నట్లు కనపడుతున్నది చేర రాజవంశం ఏ విధంగా అంతరించి పోయిందో ఇంత వరకు నిర్దిష్టంగా తేలలేదు రాజులు ప్రజలను మన్నించనందున ప్రజలు ఎదురు తిరిగి రాజ్యవ్యవస్థను తారుమారు చేసి ఉంటారని ఊహించవలసి వస్తున్నది

చేరవంశం పతనమై పోయిన తరువాత కేరళ దేశస్థులు, ఆర్య బ్రాహ్మణులు కలసి శాసనసౌలభ్యం కొరకు మొత్తందేశాన్ని నాలుగు రాజనైతిక విభాగాలుగా విభజించారు ప్రతి విభాగానికీ ఒక అధికారి "తళయాతిరి" నియమింపబడ్డారు మళయాళంలో తళమ్ అంటే స్థలమని అర్థము ఆతిరి అంటే అధికారి తళయాతిరి అంటే స్థలాధికారి ఈ అధికారులు మొదటిరోజుల్లో ప్రజలకు బాగా సేవచేసేవారు ఆర్య బ్రాహ్మణులలోనుండియే ఈ అధి కారులు తరచు ఎన్నుకొనబడతూ ఉండేవారు ప్రతిమూడు సంవత్సరాలకు ఈ అధికారుల ఎన్నిక జరుగుతూ ఉండేది ఈ శాసన విధానం చాలా కాలం వరకు నడిచింది

కాని అధికారవాంఛ మనుష్యుణ్ణి స్వార్థపూరితుణ్ణి చేస్తుంది అందువలన నెమ్మది నెమ్మదిగా ఈ అధికారులు నిరంకుశులుగా తయారయినారు దేశంలోని ధనవంతులు వారికి సహాయంచేశారు. తగాదాలు పెరిగినవి. ప్రజలు ఒకవైపుకుచేరితే అధికారులు ఇంకొక పక్షంలో చేరేవారు, అందువలన దేశం చాలా నష్టపడింది. ఎంతకాలం సంఘర్షణలో గడిచినా ఎవ్వరికీ జయం కలగలేదు, చివరకు ఇద్దరూ చేరవంశానికి చెందిన కోజ్‌రాజును ఆశ్ర

యుంచారు. తిరిగి రాజ్యవ్యవస్థ ఏర్పడింది. ఆ రాజుకు విశేషాధికారాలు లభించినవి. తగాదా తీర్పడానికి వచ్చినవాడు తనే రాజై కూర్చున్నాడు కోజ్‌రాజు ఉదయభాను బాణవర్మ "ప్రథమ కేరళ పెరుమాల్" పేరుతో సింహాసనాన్ని అధిష్ఠించాడు. ఇది క్రీస్తుకు పూర్వం 113 నాటి సంగతి.

ఈ పెరుమాళ్ రాజులు ఎంతకాలం రాజ్యం చేశారనేది వివాదాంశంగా ఉన్నది. కొంతమంది చరిత్రజ్ఞులు క్రీస్తుశకం నాలుగో శతాబ్దం వరకు వారు రాజ్యం చేశారని అంటున్నారు. కొంతమంది ఎనిమిదో శతాబ్దం వరకు వారు రాజ్యం చేశారని అంటున్నారు. కేరళ భాషలోని ప్రాచీన గ్రంథం "కేరళోత్పత్తి"లో పదిహేనుమంది పెరుమాళ్ళ విషయం తెలుస్తున్నది. ఈ గ్రంథములో మొత్తం 36 మంది పెరుమాళ్ళు కేరళ దేశంలో రాజ్యం చేశారని వర్ణించబడి ఉన్నది శిలాశాసనాలు, రాగిరేకుల వలన భాస్కర రవివర్మ చివరి పెరుమాళ్ రాజు అని తెలుతున్నది క్రీస్తు 1018 సంవత్సర ప్రాంతంలో చోళదేశపురాజు రాజ రాజ చోళుడు రవివర్మను ఓడించాడు చివరి పెరుమాళ్‌ను గురించి ఒక తమాషా అయిన కథ ప్రచారంలో ఉన్నది పెరుమాళ్ళు ఇస్లాం మతాన్ని స్వీకరించి తన రాజ్యాన్ని బంధువులకు అప్పగించి తాను మక్కా వెళ్ళిపోయినాడట అందుకు చరిత్రకు సంబంధించిన ఆధారాలు ఏమిలేవు. అనాటికి ఇస్లాము మతం కేరళంలోనికి ప్రవేశించనేలేదు ఆయనను గురించి ఇంకొక కథ ఏమంటే 73 సంవత్సరాలు రాజ్యంచేసి ఆయన తన మూడు సంవత్సరాల వయస్సులో మరణించాడు కథలు ఏవిధంగా ఉన్నా పెరుమాళు రాజులు చివరి కాలంలో కేరళ దేశంలోని కోలత్తునాడు (ఉత్తరభాగం) వేణాడు (దక్షిణభాగం) రెండూ స్వతంత్రంగా ఉండడం ఆరంభించినవి. మధ్యభాగం కొచ్చి కొచ్చి పెరుమాళు రాజుల వంశస్థుల చేతిలోనే ఉండేది ఈ వేణాళ్, పెరుమాళ్, కొళత్తునాళ్ రాజవంశాలు కేరళ సాహిత్య వికాసానికి బహువిధాలుగా తోడ్పడ్డారు.

పెరుమాళ్ళ శాసనకాలం కేరళదేశ చరిత్రలో స్వర్ణయుగం. ఈ రాజులు జన సామాన్యం యొక్క హితం కొరకు అన్ని విధాలా వసతులు కల్పించారు వ్యవసాయము వ్యాపారము, విద్య మొదలగు వానిని బాగా అభివృద్ధిలోనికి తీసుకొని వచ్చారు అంతకు పూర్వం వ్యాప్తిలో ఉన్న జనసభలు వారు రాజ్యానికి రాగానే అంతరించి పోయినవి. పెరుమాళ్ళ రాజులు బ్రాహ్మణుల శక్తిని గుర్తించి వారిని మంత్రులుగా నియమించుకొన్నారు కేరళ దేశంలో బుద్ధ ధర్మం ఏ కొద్దిగానో వ్యాపించినా ప్రాచీన కేరళధర్మమే బాగా వ్యాప్తిలో ఉండేది. స్మార్తులు కావడం వలన బ్రాహ్మణులు శివకేశవుల నిద్దరినీ సమానంగా ఆరాధించేవారు అదే సమయంలో విదేశాలనుండి అరబ్బులు, జ్యూలు క్రీస్తుశకం 68 ప్రాంతంలో వ్యాపారానికి ఈ దేశానికి వచ్చారు. థామస్ గూడా అదే కాలంలో ఇక్కడకు వచ్చారు కేరళ దేశీయులు వారినందరినీ సమానంగా గౌరవించారు

కాలసాహిత్యము దేశపరిస్థితులు మళయాళ సాహిత్యాన్ని ఉజ్జీవింప జేసినవి. విదేశ వ్యాపారస్థుల సాంగత్యంవలన అనేకమైన విదేశీ శబ్దాలు కేరళభాషలో ప్రవేశించినవి. జనాభ

ఖత్, కరార్ మొదలగు అరబ్బీశబ్దాలు, కప్పియార్, కవరి, కుర్బాన్, నసరాణీ మొదలగు సిరియన్ శబ్దాలు మళయాళభాషలో విరివిగా ఉపయోగింప బడేవి. అయినా కేరళదేశంలో మొదటి భాష "కొదుంతమిష"గా ఉండేది. అది జనం మాట్లాడే భాషగా ఉండేది. దానిలో సాహిత్యమేమీ లభించడం లేదు రాజ దర్బార్లలో ఉండే విద్వాంసులు తమిళంలో విద్వాంసులుగా ఉండేవారు. వారిప్రయత్నంవల్లనే కేరళభాషలో సాహిత్యసృష్టి ప్రారంభమైనది.

మానవజాతిలో భావాలు ముందు వ్యాప్తిలోనికి వస్తుంటవి గనుక కేరళ సాహిత్యంలో గూడా పద్యాలు ముందు ప్రారంభమైనవి గద్యం తరువాత వస్తుంది పద్యాలు స్వచ్ఛంద మనోవృత్తికి బాహ్యరూపాలు ఆదికాలంలో రమణీయమైన ప్రాకృతిక దృశ్యాలను చూచి ఆనందాతిరేకంలో తమతమ హృదయాలను కవిత్వరూపంలో కవులు బహిర్గతం చేశారు, శ్రవణ మధురంగా ఉండడం వలన శ్రోతలు వెంటనే వాటిని కంఠస్థం చేసుకొనేవారు. మళయాళసాహిత్య ప్రారంభరూపం అదే విధంగా ఉన్నది ప్రారంభయుగంనాటి మళయాళ సాహిత్యం గీతాలరూపంలో ఉపలబ్ధమవుతున్నది ఆనాటిగీతాలు మత విశ్వాసాలకు సంబంధించి ఎక్కువగా ఉన్నవి అప్పుడప్పుడు మహాభారత రామాయణ కథలుకూడా గీతరూపంలో వర్ణించబడ్డవి ఈ గీతాలకు మళయాళంలో "పాట్టు గళ" అంటున్నారు.

ఈ పాటులు చెన్తమిషంలోని ఛందోనియమాల ననుసరించి రచింపబడ్డవి. మళయాళ భాషలోని లక్షణ గ్రంథం "లీలా తిలకం"లో "పాటు"ను గురించి ఈ క్రింది నిర్వచనం చేయబడ్డది "ద్రావిడ సంఘాతాక్షర నిబద్ధ మేతుకామోన వృత్తి విశేషయిద్యమ్‌పాటు" అని వ్రాయబడ్డది గీతాలు తమిళ అక్షరమాలాబద్ధాలు కావాలి, ప్రతి చరణంలో ద్వితీయాక్షర ప్రాస ఉండాలి ప్రతి చరణంలోని ఒకటి రెండు భాగాలలోని ప్రథమాక్షరాలు సజాతీయంగా ఉండాలి సంస్కృత ఛందస్సులను అనుసరించక ఏదో ఒక విశేషమైన ఛందస్సును అది అనుసరించాలి·

ఈ క్రింది పద్యం "పాటు"కు ఉదాహరణ

తరతిలన్తానళంతా, పిళంతా పొన్నన్
తనక చేంతార్, వదుం తామర్ బాణన్‌తన్నె-
క్కర మరింతా, పొరుంతాన వన్మరుదే
కరళ రింతా వురానే! మురారీ! కణా॥
ఓరు వరంతా పరంతామమే నీ కవిం-
తురకబాయీ పిణిప్పాపమ్ నీంతావణ్ణం,
చిరతరమ్ తా! వణింతెనయ్యో! తాన్కెన్నె-
త్తిరు వవంతపురం తంకు మానంతనే!

ఓ మురారీ! కృష్ణా! నీవు భూతలాన్ని కొలిచావు హిరణ్యకశిపుని గుండెను చీల్చి వేశావు. తేలికగా బాణాసురుని చేతులను నరకివేశావు యుద్ధంచేసి రాక్షసులను పలువిధ ముల బాధించావు ఓ పరమధామా! శేషశాయీ! ఈ భవసాగరంలోనుండి బయటపడే

వరాన్ని నాకు ప్రసాదించు. హే ! తిరువనంతపురంలోని ఆనంద స్వరూపా ! నేను చాలా కాలంనుండి నీచరణములకు నమస్కరిస్తూ వస్తున్నాను

"శాస్తాంపాట్టు, భద్రకళిపాట్టు, తొట్టంపాట్టు, సర్పంపాట్టు" మొదలైనవి ఆనాటి పాటలు సామెతలకు మళయాళ భాష విధి అవసమ్మను

భాష : ఆనాటి భాష స్వరూపాన్ని నిర్ణయించడం చాలా కిష్టం ఆనాడు భాష సాహిత్య స్వరూపాన్ని ధరించడానికి ప్రయత్నం చేసేది అని చెప్పవచ్చును అందువల్లనే ఆభాషా స్వరూపం అపరిష్కృతంగా ఉండి పోయింది ఆనాటివని ఇంతవరకు లభించిన గ్రంథాలు ఆనాటివిగా కనపడటంలేదు ఆనాటి కేరళ భాషకు సంబంధించిన ఒక గీతాన్ని చదవండి

కింట మిరంటు నటమ్ చెయ్యిన్నేన్ చేవటియే
ఎన్ను మరంగ్గిల్ విల్క విణ్ణోర్ నాయకనే
వంచన చెయ్యేమ భూతకళ వంతణయుమ్ మాలోషియక్క
కేణికళ చూషమ్ తిరుక్కారియూర్, వాణముక్కణ్ణారే

నృత్యం చేసే ఓ నీలకంఠా ! నీవు ఎల్లప్పుడూ నా పూజాపీఠంమీద విరాజమానుడవు కమ్ము, హే స్వర్గపితా ! హే తిరిక్కారియూర్ వాసియైన త్రినేత్రీ ! భూతాదిగణాలు నన్ను బాధిస్తున్నవి వాటినుండి నన్ను రక్షించు

---

**కోతలు** [23-వ పేజీ తరువాయి]

నుండీ ఎరిస్తే రెండురోజుల తర్వాత సురదేవట'అని ఓ కోతక ోశాడట 'అ' అనే ఆయన 'ఇ' అనే ఆయన తో 'ఇ' ... మండదొయ్య యుగాగ అన్నాడట

'మా తాతగారు కూడా మీ తాతగారి సమకాలికులు వారు చాలా బలాఢ్యులు రెండుమైళ్ళ ఎత్తులో ఆకాశంమీద ఎగురుతూన్న పక్షులను కర్రతో కొట్టి చంపేవారు ఆ కర్ర కొనకు తగిలి రెండుమూడు చుక్కలు తెగి భూమిమీద పడ్డాయట '

' తలుకాకుండా అంత పెద్దకర్రను యెక్కడ పెట్టేవాడోయి మీతాత?' అని 'అ' ప్రశ్నించాడు

'యెక్కడేమిటి మీ తాతగారి ఆవులకొట్టంలోనే' అని 'ఇ' జవాబిచ్చాడు

తనుచెప్పిన విషయాలను కోతలుగా భావించి తనను అవమానించినాడని 'అ' 'ఇ' తో పెద్ద కలహంపెట్టుకొని కోర్టుకెక్కేదాకా వచ్చిందట

కోతలు కోసేవాడు నేటి ప్రపంచంలో చాలా తెలివైనవాడు యథార్థ వాది, ఒట్టి మట్టిపిడత, దమ్మ్ము కోతలులేకుంటే గతులులేవు

ఇట్లు కోతలు పూర్వయుగంనుండి నేటివరకు గౌరవార్థములు బడసినవి, బడయుచున్నవి, భవిష్యత్తులో బడయనున్నవి

వ్యాసము :

# జానపద గేయములు - హాస్యము

—శ్రీ బి. రామరాజు M. A.

నవరసములందు హాస్యమొకటి దీనికి హాసము స్థాయి తక్కినవానివలెనే హాస్యము కూడ బ్రహ్మానంద సహోదరమని మన పూర్వాలంకారికు లంగీకరించుట భారతీయులకు హాస్యముపట్లగల యభిమానమును చాటుచున్నది కాని హాస్యమునుగూర్చి పాశ్చాత్యుల దృక్పథము వేరు మన దృక్పథము వేరు పాశ్చాత్యుల హాస్యరచనములు చూచి మనవారు అట్టి సాహిత్యము మనకు లేదని పెదవి విరిచెదరు అట్టి సాహిత్యము మన కధికముగా లేని మాట వాస్తవమైనను కొరతమాత్రము లేదు మనవారి హాస్యము తీరువేరు అసలు పాశ్చాత్యులకును మనకును రసదృష్టియందే భిన్నాభిప్రాయములు కలవు కనుక వారియందధికముగానున్న చమత్కారసంభాషణ (wit) మఱియు హాస్యపాత్రములు(Humerous characters) మన సాహిత్యమునందు లేవేయని బాధపడనక్కరలేదు అట్టివి మన సాహిత్యమున కొలదిగనే యున్నవి నవ్వును మనవారు "వికృతాకార వాగ్వేష చేష్టాదేర్కుహకా ద్భవేత్ హాస్యో హాసః స్థాయిభావః"[1] యని నిర్వచించియున్నారు వికృతములైన యాకారము, వాక్కు, వేషము, చేష్టలు మున్నగువానియొక్క వేడుః వలన హాస్యము కలుగును దానికి హాసము స్థాయిభావము. హాస్యమును మనవా రారువిధములుగా విభజించి ఉత్తమాధమ నిర్ణయమును కూడ చేసియున్నారు "శ్రేష్ఠానాం స్మితహసితే మధ్యానాం విహసితావహసితేచ, నీచానామపహసితం తథాతిహసితం చ షడ్భేదాః"[2] ఉత్తములకు స్మితహసితములును, మధ్యములకు విహసితావహసితములును, నీచుల కపహసితము, అతిహసితమును ఆరువిధములుగా ఏర్పరుప బడినవి ఇట్టిభేదములేకాక జగన్నాథ పండితరాయలు

> "ఆత్మస్థః పరసంస్థ శ్చే త్యస్య భేదద్వయం మతం
> ఆత్మస్థో ద్రష్టు రుత్పన్నో విభావేక్షణమాత్రతః
> హసంత మపరం దృష్ట్వా విభావశ్చోపజాయతే
> యోసౌ హాస్యరస స్తజ్ఞైః పరస్థః పరికీర్తితః"[3]

యని హాస్యమును ఆత్మస్థము, పరస్థముగా విభజించెను. హాస్యరసవిషయమగు విభావమును సూచించినంతమాత్రమున ద్రష్టకు కలుగునట్టిది ఆత్మస్థమగు హాస్యము. విభావమును చూచిన వేరొకడు నవ్వుచుండగా ద్రష్టకు కలుగునట్టిది పరస్థహాస్యము. మన పూర్వా

---

1 సాహిత్య దర్పణము, విశ్వనాథకవిరాజు

2 ,, ,,

3 రసగంగాధరము, జగన్నాథ పండితరాయలు.

లంకారికు లీహాస్యము లన్నింటికి లక్షణములు నిర్వచించియున్నారు మహాకవుల రచనము లందు ఉత్తమ మధ్యమ శ్రేణికి చెందిన నవ్వుండుటచే నది సాధారణులకు పాశ్చాత్యసాహిత్య మునందు భాసించు హాసమువలె భాసించదు తొందరగా హాసమును భాసింపజేయు అధిక్షేప కావ్యములు, అపహాసపూరితమైన ప్రహసనములు, హాస్యపాత్రములు వ్యంగ్యముగా వేళా కోళముచేయు కృతులు పాశ్చాత్యులతో పోల్చిచూచుకొన్నప్పుడు కొలదిగనే గన్పట్టును. ఈ కొరత తెలుగులో మరింతగలదు. పాశ్చాత్యవిద్యా ప్రభావితులయిన కొందరాధునికులు పాశ్చాత్యులమార్గమున నడచి తెలుగులో కొంత చక్కని హాస్యమును పోషించియున్నారు శ్రీ ముట్నూరి సంగమేశంగారు తమ గ్రంథమున [1] ఆంధ్ర సాహిత్యమునగల హాస్యమును గూర్చి చక్కని విమర్శనము చేసియున్నారు అందే వారు జానపద హాస్యమునుగూర్చికూడ కొంత ముచ్చటించిరి కాని యది యక్షగానములు, తోలుబొమ్మలు, కలాపములవరకే సీమితమైనది జానపద గేయములందు పోషింపబడిన హాస్యమును ఈ ప్రకరణమున పరిశీలించుట నాయుద్దేశము

నాగరకులకుగల సుఖదుఃఖానుభూతులు జానపదులకునుగలవు వీని బాహ్యచిహ్నములగు నవ్వు ఏడ్పులును గలవు ఏడ్పునుగురించి చెప్పనవసరము లేదు జీవితమధికముగా దుఃఖ మయము కనుక నేడ్పుతప్పదు తాత్కాలికముగనైనను ఏడ్పును తొలగించి దుర్భర జీవిత మును కొంత సుగమమొనర్చి మనస్సును సుప్రసన్న మొనర్చి జీవితమును పెంచునది నవ్వు అట్టి నవ్వు ఎప్పుడెప్పుడు ఏయే విధముగా జానపదులకు కలుగునో అది వారి సాహిత్యముననెట్లు ముద్రితమైనదో పరిశీలింతము ఇంతవరకు చర్చింపబడిన గేయములం దక్కడక్కడ ప్రదర్శింపబడిన నవ్వును ఆయాస్థలములందు సూచించితిని దాని మరల దిఙ్మాత్రముగా దడవి చిన్న గేయములందు హాస్యమెట్లు అంగిగా భాసించినదో తరువాత నారయుదము

రామాయణ సంబంధమగు "కాంతగోవిందనామము" అను పాటలో స్త్రీల నెన్నడు చూచి యెఱుగని ఋష్యశృంగుని తపోవనమునుండి పట్టుకొనిపోవుట కప్పరసస్త్రీలు వచ్చిరి. వారినిచూచి ఋష్యశృంగుడు "రెండు కొమ్ములు వుండె - వీరెట్టి తాపసులో - ఏపూజచేసిరో" యని యాశ్చర్యపడి "రెండుకొమ్ములు మీకు - ఏరాజు ఇప్పించె - ఈశ్వరుడు యిచ్చెనా - బ్రహ్మ ఇచ్చినాడ" యని ప్రశ్నింప వారలాతని యమాయకత్వమునకు నవ్వుకొని యటులే యని తాపసులమనిచెప్పి యాతని మోసగించి అయోధ్యానగరమునకు కొనివచ్చిరి. ఋష్య శృంగుని యమాయకత్వముజూచి కార్యార్థులగుటచేత అప్సరసలు తమలోతాము నవ్వుకొని యుండరు కాని మనము భయములేకుండ కడుపుబ్బునట్లుగా నవ్వుకొనవచ్చును

"వికృతాకారవాక్చేష్టం యమాలోక్య హసే జ్జనః
త దత్రాలంబనం ప్రాహు స్తచ్చేష్టో ద్దీపనం మతమ్

అనికదా ఆలంకారికమతము ఇచ్చట ఋష్యశృంగుడు ఆలంబనము అతని వింతయాకారచే

1 తెలుగు హాస్యము.

కుసుమాస్త్రుని సాయకములవంటి దివ్యస్త్రీలకు నవ్వు పుట్టించుచుండ అతని యమాయకపు మాటలు మఱింత నవ్వు పుట్టించినవి అవి ఉద్దీపనములైనవి. స్తనములనుజూచి కొమ్ములనుకొనెడి ఋష్యశృంగుని యమాయకత్వము మనకు నవ్వు పుట్టించును

"అడవి ఆనే చరగోవిందనామము" లందు కుంభకర్ణుని నిద్రలేపుటకు రాక్షసులు "ముసలముల మొత్తిరి - ముష్టుల బొడిచిరి - మదపుటేనుగులచే - మట్టించిరప్పుడు - గునపములగాలిచి తనువెల్ల గాల్చిరి - సీసంబు కరగించి - చెవులలో బోసి" రట కుంభకర్ణుని నిద్రలేపుట కింతయవస్థయైనది సాధారణముగా నిద్రపోయెడువాని పిలిచి లేపెదరు కొంచెము గాఢనిద్రగలవాడయినచో తట్టిలేపెదరు కాని ఏనుగులతో త్రొక్కించి గునపములతోగాల్చి చెవులలో సీసము కరగించి పోసి లేపుట యనునది యసాధారణ విషయము కుంభకర్ణుని భీకరాకారము, మొద్దునిద్ర, దీనిచే స్పష్టమయినది ఆలంబన వర్ణనముచే నిట హాస్యము పోషింపబడినది కుంభకర్ణుని నిద్రను వర్ణించి వర్ణించి కవి మనకు నవ్వు పుట్టించుచున్నాడు. మఱియు దీనిని 'వికారితము' (Caricature) గా చెప్పవచ్చును పెద్దపనికి చిన్న యత్నము, సన్నపుపనికి పెద్దయత్నము కూడ హాసజనకమే కాగలవు పూవుల గోయుటకు గొడ్డలి తెచ్చుటయు, చెట్టు నరకుటకు గోళ్ళ నుపయోగించుటయు వికార చేష్టలే కాగలవు మహాకవి కాళిదాసు శాకుంతలమున నిట్టి చమత్కార మొకచో గలదు

"ఇదంకి లావ్యాజ మనోహరంవపు స్తపః క్షమం సాధయితుం య ఇచ్ఛతి
ధ్రువం సనీలోత్పల పత్రధారయా. సమిల్లతాం ఛేత్తుమయం వ్యవస్యతి" ౧

నిజముగా నీలోత్పల పత్రధారతో సమిల్లతను కోయబోవుట హాసజనకముకదా! నిద్రించువాని చెవిలో సీసముపోయుట గూడ నిట్టిదైనను అంత ఉత్తమముగా లేదు కుంభకర్ణుని వికృతాకారము వాని నిద్ర లేపెడువారి వికృత చేష్టలు రెండవ తరగతికి చెందిన హాస్యమును కలిగించుచున్నవి

"సూక్ష్మ రామాయణము"న శూర్పణఖావర్ణనము హాస్యరస పూరితము "ముండ్ల వెంట్రుకలు, మొండిచేతులది ముసలిరక్క సొచ్చెన్ ఆ పక్షియా కండ్లు గచ్చకాయల్, దాని బలువండ్లు దంతి కోరల్, ఘనత పాలిండ్లు రెండుబారల్. అది కండ్లజూచి శ్రీరామలక్ష్మణుల కను సైగలు చేసెన్ ఆ శూర్పణఖ మోదలు మరచి వచ్చెన్" ఇది కూడా పై యుదాహరణమువలె వికృతాకారమునకు సంబంధించిన హాస్యమే శూర్పణఖ వికృతాకారము వలన కలిగిన హాస్యముకన్న నట్టి వికృతాకారముగల శూర్పణఖ శ్రీరామచంద్రుని సౌందర్యమును మెచ్చుట, మఱియు నాతని మోహించి కోరుట ఉత్తమశ్రేణికి చెందిన హాస్యమున కలిగించును.

'సీత గడియ'యను పాటలో సీతపై రాము దలిగి వడకగది 'గడియ' (గడె) వేసికొనగా సీతమ్మ అత్తగారిని పిలుచుకొనివచ్చి భర్తగారి సంగతి చెప్పి తలుపు తీయించుకొనెను. తలుపు తీయించి కౌసల్య రామునికి బుద్ధులు గరపుచుండెను. సీతకు కావలసినది తలుపు

---

౧. అభిజ్ఞాన శాకుంతలము ౧-౧౮

తీయించు చేకాని తన యేకాంతమునకు భంగమగువట్లు కౌసల్య యచటనుండి రాఘునికి బుద్ధులు గరవుటకాదు సీతమ్మ కౌసల్యను ఎటులైన బయటికి పంపనెంచి "మా మామ దశరథులు వక్కరున్నారు అత్త, మీరుపొంది మా మామ కదకు" అని చిలిపిగా పలికి పంపించెను నిజముగా మామగా రొంటరిగా నున్నారని కాదు సీతమ్మ యావేదన తమ భార్యాభర్తల శృంగారమున కాటంకముగా నున్నదనియే యామె భావము, ఇట హాస్య శృంగారములకు మైత్రి. సీతమ్మ నర్మగర్భముగా నన్నమాటలు పరిహాసోక్తులు ఇది వాక్చమత్కృతికి సంబంధించిన హాస్యము

శ్రీరామునితో నేకాంతమున నుండగోరిన సీతమ్మ కౌసల్యతో పలికిన హాస్యలోభకారి వచనమిది పీద్యంగములందు చెప్పబడిన "వ్యాహారము"న కిది జానపద గేయములందు కానవగు ఉదాహరణము "అన్యార్థమేవ వ్యాహారో హాస్యలోభకరం వచః"[1]యని ధనంజ యుని మతము ఇది యుత్తమశ్రేణికి చెందిన హాస్యము

ఊర్మిళాదేవి నిద్రలో సీతాకాంతలకు నడచిన సరస సంభాషణము చక్కని హాస్యమున కుదాహరణము కాంతమ్మ "కుందనపు ప్రతిమ కళలూ ఈ కళ లెందుండి దాగున్నవో, దృష్టి తగులా కుండనూ నీలాల నివ్వాళులివ్వరమ్మా" యని ఊర్మిళను దెప్పిపొడువగా సీతమ్మ కల్పించుకొని కాంతమ్మను "ఇంద్రాది చంద్రులాను వలపించు చంద్రులూ మీ తిమ్ములూ, దృష్టి తగులాకుండనూ నీలాల నివ్వాళులివ్వరమ్మా" యని దెప్పి పొడిచెను. కాంతమ్మకు చురుక్కుమనెను ఆమె వెంటనే సీతమ్మను "అటువంటి మాతమ్ములనే వలపించిన మీరు సామాన్యులా"యని మరల దెప్పిపొడిచెను కాని సీతమ్మ "మాటకారి". ఇంతటితో నూరకుండక రుటితిస్ఫూర్తితో నీవు మాత్రము సామాన్యురాలవా ? "ఏమి యెరుగని తపసిని (ఋష్యశృంగుని) వో వాదినె కేళించి విడిచినావు" అని నోరుమూయించెను

"శ్రీరామపట్టాభిషేకము" పాటలో వనవాసము గడచివచ్చిన తరువాత పట్టాభిషేకము జరుగునప్పుడు అప్పుడే నిద్రలేచిన యూర్మిళను మంగళస్నానము చేయుమని చెప్పి పలుకరించి వచ్చిన లక్ష్మణునిజూచి శ్రీరామునితో శంకరుడు "ఇన్నాళ్ళవలెగాదు ఇనకులో త్తము దాసౌమిత్రి వచ్చేటి సంభ్రమ్ముచూడు" మని వేళాకోళము చేసెను ఇది శృంగార హాస్యముల కలయిక జానపదులందు గూడ ఉత్తమకోటికి చెందిన హాస్యము కాంచనగు ననుట కీయుదాహరణములు చాలును

భారతసంబంధ గాథలందు "శశిరేఖాపరిణయము"న ఘటనావికృతికి సంబంధించిన (Absurdity in action) హాస్యమెంతయో కలదు. ఘటోత్కచుడు తన మాయచే శశిరేఖను గొంపోవుట, ఆమెకు బదులుగా తానామె యాకారముతో పెండ్లిపీటలమీద కూర్చుండి వరుని లక్ష్మణకుమారుని ఇతరులకు తెలియకుండ వికృతాకారములతో బెదిరించుట పెండ్లివారినందరి 'నేడ్పించుట' మున్నగు చర్యలన్నియు మనకు నవ్వుపుట్టించును.

1, దశరూపకమ్. 8-20

భాగవత సంబంధగాథలందు శ్రీకృష్ణుని పేరుతో పెరిగిన శృంగారసాహిత్యమున తదాశ్రితమైన సున్నితమైన హాస్యమును కలదు "రుక్మిణీదేవి సీమంత"మను పాటలో శ్రీకృష్ణుడు సత్యభామతో తానక్రూరునింటికి భోజనమునకు పోవుచున్నానని బొంకి రుక్మిణి యింటికిపోయెను. ఇదితెలిసిన సత్యభామ కృష్ణుడు తనచెంతకు మరలవచ్చినప్పుడు 'అక్రూరుడె సతియాయెన అతివేగంబున మీ' కని యెగతాళిచేయును ఈ పాటయందే కృష్ణుడు రుక్మిణికి కలవమలదుచు "నీ కరములెరుపేమే" యనిన నామె "కస్తురికన్నా యెరుపు కమలనాభా మీ కరమూ" అని ఎగతాళిచేయుట, 'పారిజాతపల్లవి' పాటలో శ్రీకృష్ణ దమరావతినుండి పారిజాతమునుదెచ్చి సత్యభామ పెరటిచెట్టుగా నాటిన తరువాత "పూచిన పువులన్ని రుక్మిణికడకు తుమ్మెదలై" వెళ్ళుటవంటివి హాస్యరసపూరితములు. ఈపౌరాణిక గాథలందు కలహాశను డెక్కడ ప్రత్యక్షమైన నక్కడ హాస్యము కొంత యవతరింపక తప్పదుగదా!

చారిత్రకగేయములందు కూడా అటనట చక్కని హాస్యము కానుపించుసు పల్నాటివీర చరిత్రమున వేశ్యమాత వర్ణనము, ఆకారవికృతికి సంబంధించిన హాస్యము. పల్నాటి చరిత్ర మున మఱియు కాటమరాజు కథలందలి యుద్ధవీరుల వర్ణనముల వాక్చేష్టల వికృతికి సంబంధించిన హాస్యము కలదు కాటమరాజు కథలో నల్లసిద్ధిరాజు మఱియు కాటమరాజు రాయబారులగు భట్ల సంవాదమున వ్యాజస్తుతి, వ్యాజనింద, వక్రోక్తి, నర్మోక్తి, నీచోపమ, కాశ్వాక్షిప్తము మున్నగు అలంకారములతో అర్థసంబంధమగు వికృతిగల్పించి వాచ్యముగను, వ్యంగ్యముగను చక్కనిహాస్యము పోషింపబడినది

"నది యెఱ్ఱమట్టిపై నడచెనోయేమొ, యెఱ్ఱ బొల్లాదదా యెరమట్టిలోను
సాము చేసినవారు జగడంబు చేస్తే - ఈ మహిజనులెల్ల యేద బ్రతుకుదురు
తలపాలములో బెదరి నిలబడ్డగోవు - కిలవిలుచుకున్నట్లు కాదుకయ్యంబు,
ముద్రపాలను జున్నుముద్దలు మెసవి - గద్రున ద్రేపుట కాదు కయ్యంబు
చేసిన పెన్నల నెగపొంతగాచి - కాసున దిమ్ముటకాదు కయ్యంబు"
"మారాజ జగడాన మీరు చాలుదురె - మనసున వార్నిధుల్ మరిదాటవచ్చు
గనుకొని కాలువ కదుదాటరాదు - మాటలే పోట్లైతె మదగజము లంప
నీ చెలు కత్తులు నేలగడింప - పొదుపొదుమాట పోటులై తాకితే
కడనుండి సేయరా కయ్యమెంతైన - కావడికినిరాక సమరసంబగునే"
"చుట్టచుట్టక యెంత సుడిగిన బాము - పుట్టజొచ్చేటప్పుడు పొడుగారవలదె"

పుట 177, 178.

ఈ సంభాషణములు చాల హాస్యపూరితముగ నడచినవి. వీరగీతములందంతటను యుద్ధ వీరుల వర్ణనము హాస్యపూరితము. దేశింగురాజు పదములో తోంద్రమల్లు భయపడుచు భయపడుచు దేశింగురాజు వైష్ణవుడు కనుక తానును వైష్ణవ వేషము వేసికొనిపోవు ఘట్టము కూడ నవ్వు పుట్టింపక మానదు "పూని యెంగిలి యుమిచి సున్నమున బొవగ నామమేసి. ఘనుగు నెత్తురు నడినామముగా మానితముగవేసి" తోంద్రమల్లు దొంగ వైష్ణవు డయ్యెను—

శైవ వైష్ణవమత వాఙ్మయమున సంవాదముల కొక ప్రత్యేకత కలదు. గంగాగౌరీ సంవాదము, ఈశ్వరభృంగి సంవాదము, లక్ష్మీపార్వతీ సంవాదము, సవతుల కయ్యము, చెంచులక్ష్మికి శ్రీకృష్ణునకు సంవాదము, చెంచితకు లక్ష్మికి సంవాదము మున్నగు వానియందు చక్కని నర్మోక్తులు దెప్పిపొడుపులు, అవహేళనలు, వ్యాజోక్తులు, గల్గిన చక్కని హాస్యముండును. ఆండాళు చరిత్రమున గోదా రంగేశుల వివాహసమయమున భోజనములకు సిద్ధమైన బ్రాహ్మణుల భాషణములు గమనింప దగినవి

"సుబ్బంభొట్లూ విన్నావషరా చూడికొత్త పెళ్ళషరా
అబ్బాయిని అచ్చయ్యను మరి మన అవధాన్లను కేకెయ్‌రా
సంతర్పణలష సంతస మొదవగ, గొంతువరకు తిందాం
ముంతమామిడి పప్పు మిషాయష, ముందు మనము పోదాం"

అనుకొనువారి మాటలు నాటకములందలి విదూషకుని భోజనప్రీతిని పోలినవి ఇట్టి హాస్యమును మనవార లుత్తమ హాస్యముగా నంగీకరింపలేదు

లక్ష్మీ పార్వతులకు జరిగిన సంవాదము చాల చక్కని హాస్యమున కుదాహరణము.

ల గౌరీదేవి నీశంభుని గళమున నలుపేమిచె ఓయమ్మా
పా నారీమణి నీవిష్ణుదేవుడు నలుపుగాడటే కొమ్మా
ల - బిరుదు లేక నీ కాంతుడు జగములో భిక్షమెత్తుచేనమ్మా
పా - బలములేని ను బలిచక్రవర్తిని అడుగలేదటే కొమ్మా
ల - శంకలేకను శంకరు కరమున జింక యుండు చేమమ్మా
పా - శంకలేక వనవాసము కేగుట జింకకొరకు సుమి కొమ్మా"

గుణమును దోషముగా, దోషమును గుణముగా చెప్పి మాటలాడెడు పద్ధతిని మృదవ మందురు

"దోష గుణౌ కరణంవా తన్మృదవంనామ విజ్ఞేయమ్
పరవచన మాత్మన శ్చోత్తరోత్తర సముద్భవం ద్వయోర్యత్తు" ౧

పై గేయమిట్టి వాక్చమత్కృతికి సంబంధించిన హాస్యోదాహరణము. సవతుల కయ్యము పాటలో అలమేలు మంగను చెంచిత "వన్నె మృగమును దెమ్మంటినా, రక్కసుని వరియించి రథముపైకెక్కి లంకలోకి వెళ్ళియుంటినా" యని దెప్పిపొడిచెను ఒకొక్కమాట దెప్పిపొడుపు, నిగూఢముగా చెంపపెట్టువలెనుండును ఇట్టివాక్చమత్కారమును నాళికయందురు

"హాస్యేనోపగతార్థా ప్రహేళికా నాళికేతి విజ్ఞేయా" ౨

తద్గతమగు హాస్యముకూడ నర్మగర్భముగా నుండును. ఈశ్వరభృంగి సంవాదము పాటయందు శివుని తలపైనున్న నదతిని జూచి పార్వతి యడుగ నాతడు

"సింధు వేసవికాలమున జలముండునో లేకుండునో యని

౧. భరతనాట్య శాస్త్రము, ౧౮-౧౨౨

౨. భరతనాట్య శాస్త్రము, ౧౮-౧౧౪.

దండిగా వదిదెచ్చి జడలో దాచి యుంచినాను గాని
ఎరుగనే పార్వతీ యెరుగనే" యని బొంకును

వదియైనచో దానికి ముఖము, కనులు, కురులు, కంఠము, గుబ్బలు, మూగా రెండుల కుండునని పార్వతి ప్రశ్నింప శివు డవి జలమందుండెడు తామరలు, మీనములు, తుమ్మెదలు, శంఖము, జక్కవలు, నాగుబాములని కల్పించి యర్థము చెప్పును ఒకదానికి మరింకొక యర్థమును కల్పించి అవస్పందితమను వాక్చమత్కారములో హాస్యము పోషింపబడుటకిది యుదాహరణము

"కౌశలాదుచ్యతేఽన్యోఽర్థ స్తదవస్పందితం భవేత్" ౧

'చెంచీత కథ'లో శ్రీకృష్ణనంతవానిని చెంచిత "విమ్మాలగిరిమీద విమ్మాగ తిరిగేటి కొమ్ముల గురిపోతు నేసేవా, ఏదుపందుల నెయ్యనేరుతువా, అడవి దుప్పుల నెయ్య నేరుతువా, అనుపులున్నా జాడలెరుగుదువా, పుట్టతేనెలు పట్ట నేరుతువా, పరిగ తేనెలు ఎట్ల నేరుతువా" యని సామర్థ్యమును శంకించుటగూడ చెంచిత అమాయకత్వమును దెల్పునట్టి మృదువైన హాస్యము. ఇట్టి హాస్య మిదివరకు పరిశీలింపబడిన గేయములం దచ్చటచ్చట గానుపించుచునే యుండెను

కేవలము హాస్యపూరితములగు గేయములు మనకు కొలదిగనే లభించుచున్నవి. అట్టివాని నధికముగా ముద్రించినటుల లేదు తెన్నేటి తిరుమలదాసుగారి 'వేడుక పెండ్లిపాట' లందును, కిర్రా అచ్చయ్య అండ్ సన్సువారి 'శ్రీ జనానంద నవీనకల్యాణపాటలం'దును 'స్త్రీల పాటల' సంపుటములందును పెండ్లికి సంబంధించిన వియ్యాలవారి హాస్యపుపాటలు కొన్ని ప్రకటింపబడినవి కొండపల్లి వీరవెంకయ్యగారి 'హాస్యపు పాటల' పుస్తకమునందు తీరుతీరుల హాస్యపుపాటలున్నవి రైల్వే పుస్తక విక్రేతలమ్ము "గుమ్‌గుమా హాస్యపు పాటలం" దొకటి రెండు పాటలున్నవి శ్రీ గంగాధరంగారి వెలయేరులో అచ్చటచ్చట ప్రకీర్ణములుగా కొన్ని పాటలున్నవి సుమారేబది హాస్యపుపాటలు తెలంగాణమునకు సంబంధించినవి నేను సేకరింప గలిగితిని

పాశ్చాత్యసాహిత్యమున హాస్యానుకృతులు (Paradies) అధికముగానున్నవి. ఒక కావ్యమునో కవితాశైలినో అనుకరించి దానిని (మూలమును) వేళాకోళముచేయుట హాస్యాను కృతి యనిపించుకొనును మన పూర్వసాహిత్యమున చాటూక్తులుదప్ప ఇట్టి కావ్యములులేవు. ఆధునికులందు కొందఱిట్టి కావ్యరచనము చేసినారు శ్రీ ఉదయరాజు రాఘవ రంగారావుగారి మత్కుణోపాఖ్యానము, శ్రీ దేవిప్రసాద్‌గారి భక్ష్యేశ్వరీశతకము, జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారి పెక్కుహాస్యానుకృతులు. శ్రీ కాళోజీ నారాయణరావుగారి గేయము లిట్టివే శ్రీ రాయ ప్రోలు సుబ్బారావుగారి "ఏదేశమేగినా ఎందుకాలిడిన, పొగడరా నీతల్లి భూమి భారతిని" అను గేయమునకు శ్రీ కాళోజీ నారాయణరావుగారి "ఏదేశమేగినా ఎందు కాలిడినా, చూడరా పీజొజ్ఞ పూరు మార్గం"బన్న గేయము చక్కని హాస్యానుకృతి మూలకృతియందలి గాంభీర్య

౧. భరతనాట్య శాస్త్రము. ౧౮-౧౧౮.

మను హాస్యానుకృతి చప్పబరచి దానిని పేలవముగా లేకిగా చిత్రించును ఇట్టి విపరీత పరిస్థితి వలన కలుగు వికృతి మనకు హాస్యహేతువగును కనుక అనుకృతులవలన హాస్యరసమనునది మూలము తెలిసిననేగాని యుద్భవించదు నిజమగు సంధ్యావందన మంత్రము వచ్చిననేగాని "ఆధునిక సంధ్యావందన" మను హాస్యానుకృతి యందలి హాస్యమనుభవమునకు రాదు ఇట్టి హాస్యానుకృతులు జానపదసాహిత్యమునగూడ గలవు అట్టివాని కొన్నింటి నుదాహరింతును

చిక్కుడుచెట్టుకు తీగలందమ్మ
శ్రీకృష్ణ తమ్ముడికి తిరుమణందమ్మ
వీరయ్య పాదులకు పూవులందమ్మ
పణతికి పదినెలల బాలుడందమ్మ
కాకర తీగెకు కాయలందమ్మ
కన్నతల్లెట్టిన్న సొమ్ములందమ్మ

అను చక్కటి జానపదగేయ మొకటి కలదు దీనికి హాస్యానుకృతియగు నొక దంపుళ్ళ పాట గలదు

సువ్వి సువ్వన్న సొగను మల్లన్న
దీరపాదుకి పిందెలందమ్మ
మావారి ముక్కుకు పక్కులందమ్మ
పొట్లపాదుకి పూపులందమ్మ
కాల్లకుక్క మగడు కాంతకందమ్మ
తోటకూర కింబమూ దొడ్డికందమ్మ
మావారి పాగచుట్ట నాకు నందమ్మ
కాటుక యుంచేనె కనులకందమ్మ
వెనుకదిక్కు లేకుంటె వెలదికందమ్మ
మస్తుగతించేనే మగువకందమ్మ
అత్తమామలుచస్తె ఆతివకందమ్మ
దొంగదూడకు గుదికట్టె యందమ్మ
దొంగ మగనికి పెంకిపెండ్లా మందమ్మ

ఈపాట యింకను ఇటులనే సాగిపోయినది మూలమందలి గాంభీర్యమును, ఉదాత్తతను, గమనింపుడు దీనిని చదివిన తరువాత మూలముపైగల గౌరవభావము పూర్తిగా తారుమారై వేళాకోళము క్రిందికి దిగినది ఇట్టి హాస్యానుకృతులు జానపదసాహిత్యమున ననేకము లున్నవి. పెండ్లియైన తరువాత అప్పగింతలసమయమున వధువునకు తలిదండ్రులు మున్నగువారు గరపెడు నీతులు, బుద్ధులు సుప్రసిద్ధములు శ్రద్ధ భక్తి, నీతి, వినయము, పాతివ్రత్యము, సహనము, శాంతము, సౌశీల్యమువంటి ఉదాత్తవిషయములీ యప్పగింతల పాటలందుండును అట్టివానికి హాస్యానుకృతియగు అప్పగింతలపాట యొకటి చిత్తగింపుడు.

౧ "అత్తమామలుగాని - ఆడుబొడ్డెలుగాని
లేరమ్మ నీదెంత పున్నెమోగాని
౨. మగడొక్కడేగాన మనసు కెక్కినయట్లు
మర్దించి నీవశము చేసికోవమ్మా
౩. నీమాట వినబడ్డ నిమిషంబునందు
అదలిపోయేటట్లు అతని భయపెట్టు
౪. పతికోప పడినప్డు పడియుండబోక
అంతకు పదిరెట్లు అతని మర్దించు
౫ ఇరుగు పొరుగు వారలేమైనంటే
యేద్వక పెయిరెట్లు దుమ్మెత్తిపొయ్యి
౬ భర్తను వంచుకోగల భార్య గౌరవమెన్న
రారాజునకునైన రమణిరో లేదు.
౭ ఇవియెల్ల మరువక ఏమాత్ర మలియక
సుఖపడుచుండుమో సొగసు పూదీవ"

ఎంత విపరీతమగు యప్పగింతలో చూచితిరికదా!

పసిపిల్లల లాలించుటకు, నిద్రపుచ్చుటకు లాలిపాటలు, జోలపాటలు ప్రసిద్ధిగన్నవి. కన్నతల్లి తన సంతానముగూర్చియో, పుట్టింటివారి గూర్చియో, తన అత్తింటివారి గూర్చియో లేక భగవంతుని గూర్చియో ఇట్టిపాటలందు పాడుకొనును. పాటపాడుచు జోకొట్టిన యెడల పసిపిల్లలు యేడ్పుమాని సుఖముగా నిద్రింతురు. ఒక విపరీతపు జోలపాట గమనింపుడు.

౧ జోజో నాతండ్రి జోజో తండ్రీ
తోడు గుఱ్ఱాల పార్టుపై వస్తాడు మామా జోజో.
౨ పాలుపెరుగుపోసి పదిపెంచినాను
వీలుగాదంటాడు పెంకి నీతండ్రి జోజో.
౩ పనిలేక పొరుగిండ్ల కనయంబు పోవ
ఘనమైన ముచ్చట గలుగునుర తండ్రి జోజో.
౪. పాలుత్రాగి నీవు పడియున్న యెడల
బాలయ్యతో బోయి మాట్లాడివస్తా జోజో.
౫ కలకాల మొకయింట కాపురముచేయ
కలుగుట కష్టమురా కన్న నా తండ్రి జోజో.
౬. పైరాబులేకాని పలుకు పస లేదు
చూడరా నీతండ్రి వింత హొయలెల్లా జోజో.
౭. ధనముకొరకై నేను తానాడుచుంటి
అదియున్న నీ తండ్రి నవల కంపింతు జోజో.

ఇట్టి హాస్యాత్మకకృతులు మంగళహారతులకును, మేలుకొల్పులకును, కోలాటపు కీర్తనములకును, గణపతిస్తోత్రములకును, వేయేల ననేక విధములగు గేయములకును కలవు వాని నన్నింటి నుదహరించిన గ్రంథము కాదు. ఇట్టి గేయములందు ముఖ్యముగా మూలమును తేలికచేసి వికృతిని గల్పించి హాస్యమును పుట్టించుటే ముఖ్యోద్దేశమని గమనించిన జాలును.

వాక్చమత్కృతి ద్వారమున వికృతిని గల్పించి హాస్యమును పుట్టించెడు పాట లధికముగా గాన్పించును. ఇట్టి వాక్చమత్కృతిగల గేయములు జానపద సాహిత్యమున కొల్లలు. గూఢార్థములగు మాటలు పేర్చి ప్రశ్నోత్తరముల జరిపెడు పద్ధతిని ఉద్ఘాత్యక మందురు. ఇదిగూడ వీథ్యంగములం దొకటి

"యో౽జయన్తి పదైరన్యైః తముద్ఘాత్యక ముచ్యతే
యత్రాన్యస్మిన్ సమావేశ్య కార్యమన్యత్ప్రసాద్యతే" ౧

వెలయేరులో శ్రీ చమత్కార మను శీర్షికలో నున్నగేయ మిందు కుదాహరణము.

శ్రీ ఒకరికి చేయినిచ్చి - ఒకరికి కాలునిచ్చి
ఒకరికి నడుమునిచ్చి - కూకున్ననోయి రాజా కూ.
పు. ఎవరికి చేయినిచ్చి - ఎవరికి కాలునిచ్చి
ఎవరికి నడుమునిచ్చి - కూకున్నవోయ్ జాణ కూ.
శ్రీ: గాజుల్కి చేయినిచ్చి - అందెల్కి కాలునిచ్చి
వడ్డాణానికి నడుమునిచ్చి - కూకున్ననోయి రాజా కూ

ఈ పాటలో శ్రీ పైకి చెప్పినమాటలు వినినంతనే సంశయము కలుగక మానదు. కనుకనే పురుషుడు తొందరపడి ప్రశ్నించుట జరిగెను మొదట చెప్పిన మాటల ప్రకారము సమాధానము శృంగారమునకు సంబంధించినదిగా నుండి యుండునని ప్రశ్నించెడు పురుషుడును మనమును భావింతుము కాని యా శ్రీ సమాధానము వచ్చునప్పటికి అనుమానము తొలగిపోవుటయేకాక మనమాశించెడు సమాధానమురాక చప్పని సమాధానము వచ్చి వికృతిని పుట్టించి నవ్వించును. ఈ గేయమంతయు నిటులే సాగిపోయినది. ఉద్ఘాత్యకమందు మూడవ రకమునకు చెందిన యుదాహరణమిది. ఉద్ఘాత్యకమునకు ఉదాహరణములు శిష్టసాహిత్యమునందు లభించును ప్రబంధములందలి పుష్పలావికలయు, యువకులయు సంభాషణములు చూడనగును

అనుకొనని వంచనమున గూడ వికృతిగలిగి నవ్వు పుట్టును. మొదట ప్రియవచనములుగా దోచి తరువాత మెల్లగా అప్రియములు భాసించిన సున్నితమగు హాస్యము పుట్టును. ఇట్టి వాక్చమత్కారమును ఛలనమందురు ౨ "అన్యార్థమేవ వాక్యం ఛలమభిసంధాన

౧. భరతనాట్య శాస్త్రము ౧౮—౧౧౬
౨. భరతనాట్య శాస్త్రము ౧౮—౧౨౨

హాస్యరోషకరమ్" సిరిసిల్ల తాలూకా హనుమాజిపేట గ్రామమున (1954) సేకరించిన పాట దీని నుదాహరణముగా నిచ్చుచున్నాము.

౧. "అంతేనాకు చాలు
తమ్మలపాకు తొడిమే పదివేలు
అందరివోలె అడిగేదాన్ని కాను.
కొందరివోలె కొసరేదాన్నిగాను "

మొదట నీప్రియవచనములాడిన స్త్రీ యెంతో సౌశీల్యవతి యనుకొందుము. తరువాత మెల్లగా నామె యప్రియ వచనములకు దొంకొనును.

౨. ముక్కుకూ ముక్కెరలేక, ముక్కు చిన్నబోయినాది
నీముగ్గురూ బిడ్డాలనమ్మి, ముక్కుకూ ముక్కెరతేరా అంతే.

౩ చేతులకు చెండీలులేక, చేతులు చిన్నాబోయినాయి
నీతోటి చెల్లెండ్లనమ్మి, చేతులకు చెండీలుదేరా అంతే.

౪. కాళ్ళకూ కడియాలులేక, కాళ్ళు చిన్నాబోయినాయి
నీ కన్నతల్లినమ్ముకోని, కాళ్ళకూ కడియాలుదేరా అంతే.

౫. నడుముకూ వొడ్డాణంలేక, నడుము చిన్నాబోయినాది
నీనల్గురూ కొడుకులానమ్మి, నడుముకు వొడ్డాణంతేరా అంతే

౬. మెడకు కంటెనులేక, మెడ చిన్నాబోయినాది
నీమేడలన్ని అమ్ముకోని, మెడకు కంటెలుదేరా అంతే.

౭. పట్టెమంచం పరుపులేకా, మనసు చిన్నాబోయినాది
నీ సూటుబూటు నమ్ముకోని, పట్టెమంచం పరుపుదేరా అంతే.

(చివరిచరణమున సూటుబూటు లుండుటచే నీపాట ఆధునికమై యుండును లేదా నీభాగము మాత్రము ప్రక్షిప్తమైయుండును )

తములపాకు తొడిమెయే పదివేలుగా భావింతునని తొలుత ప్రియములు పల్కిన స్త్రీ తరువాత "చావుకబురు చల్లగా వినిపించినట్లు" తనకు కావలసిన భూషణములు వస్తువాహనముల పెద్ద పట్టికనిచ్చి వానికై బిడ్డలను తల్లిదండ్రులను మేడమిద్దెల నమ్ముమని యప్రియము లాడుచున్నది ఇట్టి చలనము మనకు నవ్వు పుట్టింపకమానదు ఓరుగల్లుజిల్లా మడికొండ గ్రామమున (6-1-1952) సేకరించిన మరియొక గేయ మిట్టిదే

వానగొట్టాందిబావ, వదినే వచ్చేనమ్మ
ఎట్లా పొమ్మందువదినె, వానగొట్టాంది బావ వా.
పీటు కుస్తామంటే, చిల్లాలచెంబాయె
పీటవేస్తామంటె, పిల్ల నందాచెనమ్మా * వా.
చాపవేస్తామంటె, నందు కొంచెమాయె

* (ఋతుమతియాయెననుట)

కల్లదెస్తామంటె, చెల్లావి పైసాయె వా
సామలు దంచుదామంటె, సన్నావి ధాన్యమాయె
కొఱ్ఱలు దంచుదామంటె, కొత్తాధాన్యమాయె వా
కోడిని గోస్తామంటె, గుడ్లమీదికోడి వదినె
వడ్లూ దంచుదామంటె, ఇత్తనాలవడ్లు వదినె వా
కౌగిలిచ్చుకుందామంటె కడుపూలబిల్ల వదినె
కండ్లచూస్తామన్న, కండ్లొచ్చెనాయి వదినె వా.
నవుటోయె తోవలోనె, కుడుకాలంగడి వదినె
పీకుప్పె కుదువబెట్టి, కొబ్బెరంపునాయి* వదినె వా
నవుటోయె తోవలోనె, మట్టెలంగడి వదినె
పీ మడిమె కుదువబెట్టి, మట్టెలంపునాయివదినె వా
నవుటోయె తోవలోనె, గాజులంగాడి వదినె
పీకాలు కుదువబెట్టి, గాజులంపునాయి వదినె వా.

పై పాటలో ఒక మరదలు వదినెగారి నేతీరుగా సత్కరించినదో గోచరించును. వాన గొట్టుచున్నదనియు, పొమ్మనుటకు నోరురాదనియు కొంత ప్రియములాడిన మరదలు తరువాత వదినెగారికి కాళ్ళు గడిగికొనుటకు నీళ్ళిచ్చెదమన్న చిల్లులచెంబనియు, పీటవేసెదమన్న, బిడ్డ పమర్తపై పీటపై కూర్చున్నదనియు, చివరకు చాపయైన వేసి కూర్చుండబెట్టెదమన్న, స్థలము చాలదనియు, వదినెగారికి త్రాగుటకై కల్లు దెచ్చెదమన్న చేతనున్నపైస చెల్లదనియు, సామలు దంచెదమన్న సన్నని ధాన్యమనియు, కొఱ్ఱలు దంచెదమన్న క్రొత్త ధాన్యమనియు వడ్లుదంచి అన్నంబెట్టుదమన్న, విత్తనములకై తీసినవడ్లనియు, చివరకేమియుచేయుటకు వీలు లేనట్లుగా నప్రియములాడినది. అనవసరవ్యయమనుకొని యిట్లు చేసెననుకొందమన్న ఏమాత్రము వ్యయములేని పని కౌగిలించుకొని మర్యాదచేయుట కదా! కౌగిలించుకొందమన్న కడుపులో బిల్ల (గడ్డ) యైనదట. చివరకు కన్నులు తెరచి చూతమన్న కండ్లువచ్చెనట ఎంత చమత్కారమో గమనించితిరిగదా! వదినెగారికి 'పెట్టుపోతలు' లేవుగదా కన్నులతో చూచుటకు గూడ మరదలు నిరాకరించినది ఇంతటితో ముగిసినదికాదు. వదినెగారు తిరిగి పోవు మార్గమందు కుడుకలంగడి, గాజులంగడి, మట్టెలంగడి యున్నవట. పోవుచుపోవుచు తనకే కొనివంపుమని కోరుచున్నది వదినెకు తాను పెట్టినదేమియులేదు కదా, పైపెచ్చు తనకే కొనివంపించవలయునట. కొని పంపించునది వదినెగారి వీలునను సరించి కాదుసుమా. మడమలు, కాళ్ళు, చేతులు కుదువబెట్టియైన మరదలుగారికి మట్టెలుమున్నగునవి కొని పంపింవలెనట. చూచితిరా! మొదటి ప్రియవచనములకు తరువాతి యప్రియవచనముల కెంతభేద మున్నదో! ఇంకను నేను సేకరించిన

* (నాయొక్క సుమంతు)

"దగ్గువడిపెం వట్టింది బిడ్డలారా
మీరు దగ్గరికి రాకండి బిడ్డలారా" యను పాటయు
"తమ్మాని బిడ్డాని, తనకోడనాని
దయతోడ బెట్టింది, తక్కెడేకూలు"

యనుపాటయు ఈ కోటికి చెందినట్టివే

గ్రామికగేయ ప్రకరణమున పాలెవారికి సంబంధించిన పాటలు, అగపాలె వారికి సంబంధించిన పాటలు పేర్కొని యుంటిని అవికూడ చక్కని హాస్యమున కుదాహరణ ములుగా గ్రహింపవలయును శృంగారగేయ ప్రకరణమున సతీపతులకు జరిగిన సంవాదమున జారిణియగు భార్య తన భర్త ప్రశ్నములకు చమత్కారపూరితములగు సమాధానము లిచ్చుట సూచించియుంటిని, అది కూడ హాస్యమున కుదాహరణమే.

ఇక పాత్రములకు వికృతినాపాదించి (తిర్యగ్జంతువులకు కూడ) హాస్యమును పోషించు గేయము లనేకములు గలవు ఒక పాత్రమునందలి యమాయకత్వమును తత్ఫలితముగా జరిగెడు వికృత చర్యలను వర్ణించుట గూడ హాస్యమును సృష్టించును. ఇది ఆలంబన వర్ణన మున గలిగెడు హాస్యము. ఆలంబన మొక పాత్రమైనను లేక ఒక ఘటనయైనను కావచ్చును. హాస్యము ఆలంబన ప్రధానమగు రసమగుటచే ఆలంబనము నెంతగా వర్ణించిన నంత హాస్య ముద్భవించును. పెండ్లిపాటలందు పేర్కొనబడిన వియ్యాలవారి పాటలు దీని కుదాహరణము. హనుమాజీపేటలో సేకరించిన మరియొక గేయమున మరదలు వదినెగారి నెట్లు హేళనముచేయుచున్నదో గమనింపుడు. దీనిలో గమనింపవలసినది ఆలంబనము యొక్క అమాయకత్వము.

వదినెకు తగదర - బిందెకు బిగదర
బంగరు కుచ్చుల మా వదినే
గోదపొంటి (వెంబడి) రెండు నల్లులు పారితె
ఉలవలంటదీ మా వదినే
బుక్కాతనంటది మావదినే
సరాల (పట్టెలు) పొంటి రెండు తేళ్ళు పారితే
సేవా (సేమెలు) లంటది మావదినే
తింటానంటది మావదినే.
దూలాలపొంటి పాములు పారితె
కడియాలంటది మావదినె
పెట్టుకుంట నంటది మావదినె
శక్కరబుక్కి దొడ్లెపంచే (పడుకొమంటచే)
రీమలు కుట్టిన మా వదినే

అన్నంతినక అత్తల బంచే
అన్నయ్య కొట్టిండా వదినే

పై పాటలో ఆలంబన యొక స్త్రీ. వేరొక పాటలో నీయాలంబన యొక మేక. ఈపాట గూడ హనుమాజీపేటలోనే సేకరించితిని

మాకెపో (మేకపోతు) తంటది గొత్తె
గొత్తెపోతంటదీ మాకే

౧ మందలా కాలోల్లు (సాలెవారు)
మాట మాట్లాడంగ
చూడవచ్చిరాని తాముదిపె మాకే — మా

౨ దోసిట్ల రూపాయలు
గొంగిట్ల బొయ్యంగ
వరదచ్చి (వరదక్షిణ) నని మురిపె మాకే — మా

౩ మెడకు తాడుబెట్టి
గొరగొర గుంజంగ
కంజెబెట్టిరని తామురిపె మాకే — మా

౪ గొంగొర గుంజుకొచ్చి
పంచిట్ల గక్తేస్తె
పెండ్లిఎందిరాని తామురిపె మాకే — మా

౫ అచ్చిపోయేటోల్లు (వచ్చి పోయెడువారు)
అటీటు (అటుఇటు) నడువంగ
చూడవచ్చిరాని తాముదిపె మాకే — మా.

౬ కాళ్ళు పేకులుబట్టి
కంట్లంలు (కంఠము) గొయ్యంగ
కైలాసపురమని తాముదిపె మాకే

౭ ఏడురూపాయలకు ఏడుకుప్పలేసి
ఎవ్వలింటికి వాళ్ళు కొంచబోతుంటేను
కుదుక కనమూ (కణగు) లావితా మురిపె మాకే

౮. కార్యాలు (కార్యములు) దొబ్బలు
కలిపివేయంగానె
ఓడిబియ్యమని తామురిపె మాకె — మా

౯ ముసలోల్లు (ముసలివారు) పైసోల్లు (పడుచువారు)
బొక్కలూ (ఎముకలు) కంకంగ (నములగా)
అచ్చింత (అక్షతలు) లని మురిపె మాకే — మా.

౧౦. ఏకినా బొక్కలూ
కాకలా పారేస్తె
కుక్క నక్కలొచ్చి ఎత్తుకపోంగనే
బకుంటపద (వైకుంఠపదవి) మని జామురిసె మాకె — మా.

౧౧ మిగిలిన్న బొక్కలూ
గద్దలెత్తుకపోంగ
పూలరదమాని జామురిసె మాకె — మా

ఈ పాటలోని పాత్రము (మేక) అలంబనము దాని మూఢత్వముచే హాస్యము పోషింపబడినది తెలివితక్కువ మేక తనకు రాబోవు విపత్తును గ్రహించలేక దానిని కల్యాణముగా భావించుటలో హాస్య ముత్పన్నమగుచున్నది. ఇదియొక యపూర్వగేయముగా భావింప వచ్చును దీనియందు అసురమైన హాస్యము (Devili.h humour) కలదు. మేకయొక్క విపత్తును ఆలంబనముగా చేసికొని కటికవాడిట్లు నవ్వుకొనుచునుండెను. దీనియందు దైవీ హాస్యముగూడ వ్యంగ్యముగా భాసించుచున్నది మేకయొక్క ఆపత్తునెడ సుంతజాలిపడుటయు దీనియందు ధ్వనించుచున్నది. సాధువర్తనుడొకడిట్లు విచారించును "అయ్యో ఈ మేక ఎంత యమాయక జంతువు పెండ్లికి పోవుదానివలె తన మరణమునకు పోవుచున్నదే" యని చింతిల్లును ఇది వేదనాత్మక (Poignent humour) మైన హాస్యము.

కొంచె మైనదానిని గొప్పగనో, గొప్పదానిని కొంచెముగనో చిత్రించి వర్ణించుటగూడ హాస్యమును పుట్టించును చాకిదానిమీద, నల్లిమీద, కల్లుమీద, పొగచుట్టమీద చెప్పబడిన చాటుపద్యము లిట్టివే జానపద గేయములందుగూడ నిట్టిహాస్యము పోషింపబడినది నస్యవు కాయ సాధారణమైన వస్తువు అది పోగొట్టుకొన్న వాడెవడో దానికై యేడ్చెను. వాని యేడ్పొక గేయమైనది ఈ నస్యపుకాయ పాట లింగంపల్లి గ్రామమున సేకరించితిని ఇది కూడ యొక విధమగు హాస్యానుకృతియే

పోతివి గదవే నాముద్దుకాయ
పోతివి గదవే నస్యవు కాయ
కట్టా పోవకుపొడి (పొగాకుపొడి) పొట్టానిండాబోసి
పిట్టావలెవిన్ను ఎట్టూక తిరుగుదు — పో.
కులము వెండిపెట్టి గజ్జెలు చేయిస్తి
అప్పు దీరకముందే చెప్పాక పోతివి — పో.
కట్టనూరికాడ కిర్నాలబాయిల (కరణాల బావిలో)
జానమాడపోతె దానమై పోతివి — పో.

నస్యపుకాయ సాధారణమైన వస్తువు అదిపోయినందుకు దానిని వర్ణించుచు ఏడ్చుటచే మనకు నవ్వుపుట్టుచున్నది

హాస్యసృష్టికి పాశ్చాత్యు లవలంబించిన అధిక్షేపకావ్య (Satire) రచనము గొప్ప సాహిత్య ప్రక్రియ. అధిక్షేప కావ్యములు పాశ్చాత్య వాఙ్మయమున ననేకములుగా నున్నవి. ఒక వ్యక్తి గాని, ఒక సంస్థనుగాని, ఒక సంఘమునుగాని, లేక యొక జాతినిగాని, మూఢా చారములనుగాని హేళన మొనర్చుట యధిక్షేప కావ్యములం దుండువస్తువు. ఇట్టివి మనకు మన పూర్వసాహిత్యమున చాటూక్తులు లభించును. వేమన, చౌడప్ప వంటి శతకకారుల రచనములందీ హాస్యము కానవగును. కందుకూరి వీరేశలింగం పంతులుగారి "సత్యరాజా పూర్వదేశయాత్ర"లను కల్పనాగ్రంథ మిట్టిదే. తిరుపతి వేంకట కవుల "గీరతము", అనంత పంతుల రామలింగశాస్త్రిగారి "శుక్లపక్షము", పానుగంటివారి "సాక్షి" యుపన్యాసములు, శేష భట్టరు వేంకట రామానుజాచార్యులవారి (తెలంగాణము) "ఆంధ్రనామ సంగ్రహము" మఱియు నితర వ్యాసములు, అధిక్షేప కావ్యములుగా ప్రసిద్ధి కెక్కినవి. జానపద సాహిత్య మున నిట్టి యధిక్షేపగేయములు కొలదిగనే లభించును. లభించినవి గూడ సంస్కార దృష్టిగల వేదాంతుల రచనములై యున్నవి కనుక వీరివందరిని వేమనకు వారసులుగా చెప్పుకొన వచ్చును. అగ్రవర్ణములవారి యాడంబరముల పైనను, దొంగసన్యాసుల వేషముల పైనను, సంఘమున జీర్ణించియున్న మూఢాచారముల పైనను వేమన్న దాడివెడలెను. చక్కని హాస్యముతో యధిక్షేప రచనములుచేసి అధిక్షేపమునకు గురియైనవాని గూడ నవ్వించెను. లోక కల్యాణమునకు తోడ్పడు నిట్టియధిక్షేపము—హాస్యము—ఉత్తమకోటికి చెందినది వేమనగారు పోషించిన హాస్యమును శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు చక్కగా వివరించి యున్నారు[1]—తరువాతి వేదాంతులు కూడ వేమనగారి యడుగుజాడలందు నడచి మూఢాచారములపై దాడి వెడలిరి అట్టివారి గేయములు కొన్ని మనకు వేదాంత తత్త్వములున్న గ్రంథములందు లభించును.

పాశ్చాత్య సాహిత్యమందు కొన్ని హాస్యపాత్రములు కలవు ఫాల్‌స్టాఫ్, డాన్‌క్విక్సాట్ వంటి పాత్రములు మన సాహిత్యమున లేవు మన విదూషకులు, శకారులు, చోదిగాండ్రు ప్రదర్శించునట్టి హాస్యము బండహాస్యము అది అధమము మొక్కపాటివారి బారిష్టరు పార్వతీశం, గురజాడవారి గిరీశం మున్నగు పాత్రములందు పాశ్చాత్య హాస్యపాత్రములందు కానవగు హాస్యము మఱియు (Witticism) చమత్కృతి కొంత కాన్పించును "విట్ అనేది వాక్చమత్కృతి లేక వికృతిని తటాలున ఆరోపించగల ప్రజ్ఞ"[2] అనగా ఆలంబమునగల వికారమును సూటిగా చెప్పక కొంత కళాత్మకముగా ఉపమ దృష్టాంతము మున్నగు అలంకారములతో చెప్పి తత్సామ్యముచే హాస్యమును కలిగించుట (విట్) చమత్కార సంభాషణ మనబడును. ఇది మేధస్సుకు పని కల్పించునట్టిది చమత్కారము కేవలము వాచ్యమైనచో సాధారణ హాస్యముగా మారి అందఱికిని అర్థమగునట్లు స్పష్టముగా నుండును వాక్చమత్కృతి వేమన మఱియు నితర శతకకారులం దధికముగా గాన్పించును.

1. వేమన

2. తెలుగు హాస్యము పుట 28.

ఇట్టి హాస్యము జానపద వాఙ్మయమున చాల ఎక్కువగా నున్నది కాని గేయములందు తక్కువగా నున్నది ఇచ్చట వాఙ్మయము విస్తృతావధిగల పదము చమత్కృతి జానపదుల సామెతలం దధికముగా నుండును. సామెతలు గేయవాఙ్మయమున చేరవు కేవలము గేయములందు వాడబడిన సామెతలలో అచ్చటచ్చట నీచమత్కృతి మనకు కాన్పించును.

"తగతంత్రి జంపిన తగవుండగా లంజె
జగడాలబోవు నాజాడ నాజాడ"
"వరద బోయెదు వాడు వరదనుండెడివాని
వెఱవకు వెఱవకు మన్న విధము నా విధమూ"

యను యాగంటివారి వచనము లిట్టి హాస్యమునకు తార్కాణములు పసకాడ పన్యాసి గంగా వివాహమున "కక్కూర్తిపడితేను కడుపు నిండగవలెను, కడుపునిండని వట్టి కక్కూర్తియేల" (పుట 15) "దొప్పక్రిందనుచేరి దోనిలొగ్గినరీతి తృప్తి నాశసు జెందునో తోయజనేత్రి" (పుట 16) "ముందున్న శ్రవణముల కంటేను మిక్కిలి వెనక కొమ్ములువాడి వినవె గౌరమ్మ" (పుట 36) వంటి సామెత లిట్టి హాస్యమున కుదాహరణములు. జానపద గేయము లందున్న సామెతల నన్నింటిని భాషా సారస్వత విషయముల ప్రకరణమున జూడవచ్చును ఆసామెత లందెన్నియో ఇట్టి 'విట్' చమత్కృతిచే హాస్యమును వెలిగించును

జానపద గేయములందు గానుపించు హాస్యము మన జాతీయ హాస్యము శిష్టసాహిత్యమునను్న హాస్యము సంస్కృత మూలగ్రంథములనుండి వచ్చినట్టిది భారతీయులందరికి గల సంపద. కేవలము జానపద జీవితమునుండి గ్రహించు హాస్యము జాతీయమైనది పండితులుగూడ నిత్యనైమిత్తిక జీవితమునగల హాస్య సన్నివేశములనుండి హాస్యమును గ్రహించి తెలుగు శిష్టసాహిత్యమున నెక్కించిరి సంస్కృతానువాదములందిట్టి హాస్యము ప్రవేశించి మూలమునకు మెఱుగులు దిద్దినది ఇట్టి సున్నిత హాస్యముతోపాటు జానపదు లందు మోటుహాస్యముగూడ కలదు, అది అధమ హాస్యము అంతమాత్రమున విచారింప బనిలేదు ప్రపంచమందలి సాహిత్యములన్నింట నిట్టి హాస్యము గోచరించుచునే యుండును. జానపద గేయములం దధికసంఖ్యలోగల స్త్రీల పాటలందు మోటు హాస్యముండదు. మృదువై సభ్యమైన హాస్యమే స్త్రీల పాటలందుండును ఇట్టిహాస్యము జానపదుల నిత్యజీవితమును సుఖమయముగా నొనర్చుటకు దోహద మొసంగును జీవితమందలి స్తబ్ధతను (Dullness) పోద్రోలి ఉల్లాసమును, ఉత్సాహమును చేకూర్చి హాస్యము మానవుని జీవితమును సరస మొనర్చుననుటలో సందియము లేదు.



పుస్తక పరిచయము :

# కవికోకిల గ్రంథావళి-4

## వ్యాసములు

| రచన | ప్రచురణ : |
|---|---|
| కవికోకిల శ్రీ దువ్వూరి రామిరెడ్డి | కవికోకిల గ్రంథమాల |
| పెమ్మారెడ్డిపాళెం, ఎల్లాయపాళెం పోస్టు | నెల్లూరుజిల్లా |

వెల : మూడురూపాయలు

"పానశాల", "కృషీవలుడు", "జలదాంగన" మున్నగు కావ్యములు రచించి ఆధునికాంధ్ర సాహిత్యంలో ప్రముఖ వ్యక్తిగా నిలిచిపోయిన శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు అప్పుడప్పుడూ వివిధ పత్రికల కొరకు, రేడియో ప్రసంగముల నిమిత్తం వ్రాసిన వ్యాసములు ఈ పుస్తక రూపంలో పాఠకుల కందజేయబడినవి తమ ప్రశస్తమైన కావ్యాలతో పాఠక లోకాన్ని అలరింప జేసినట్టి ప్రఖ్యాత కవులు స్వయంగా సాహిత్యచర్చ జరిపి, సాహిత్యానికి సంబంధించిన వివిధాంశాలపై తమ అభిప్రాయాలను ప్రకటించినప్పుడు అట్టి అభిప్రాయాలకు ఒక ప్రత్యేకమైన విలువ ఉంటుంది కాబట్టి ఈ వ్యాససంపుటికి ఆంధ్ర సాహిత్యంలో ముఖ్యస్థానం ఉన్నది సంపుటిలో మొత్తం ఎనిమిది వ్యాసాలున్నవి "కవిత్వ తత్త్వ నిరూపణము" అను వ్యాసంలో లోకోత్తరమైన సృష్టిచేయు కవియొక్క ఘనత, కవిత్వావతరణం, కవిత్వ తత్త్వము, కావ్య జీవితము, కవిత్వ శిల్పము, రసరామణీయకము, శిల్ప సీమలు, కవిత్వ ప్రయోజనము, కావ్యము—నీతి, మొదలగు విషయాలను గూర్చి చర్చ జరిపారు డెబ్బది పేజీల మేరకు విస్తరించిన ఈ విపులమైన చర్చలో వామనుడు, కుంతకాచార్యుడు, క్షేమేంద్రుడు, ఆనందవర్ధనాచార్యులు, మమ్మటుడు, విశ్వనాథుడు మున్నగు సంస్కృత లాక్షణికుల సిద్ధాంతములు, గేథే, వర్డ్స్వర్త్, కార్లయిలు, షెల్లీ, లేహంట్, అలన్‌పో, బుచ్చర్, అరిస్టాటల్ మున్నగు పాశ్చాత్య సాహిత్యవేత్తల అభిప్రాయములు సందర్భానుసారంగా ప్రస్తావించబడినవి ఈవిధంగా తులనాత్మకమైన పరిశీలన జరుపడం చేత ఆధునికులకీవ్యాసం ఇంకను కావ్యవిమర్శ చేసుకోవడానికి మిక్కిలి ఉపయోగకారిగా వున్నది చిరంజీవములయ్యే ఉత్తమ కృతులలో అంగాంగసంయోగత, అనురూపత, వస్తువందలి సార్వజనీన స్వభావము, కవి వ్యక్తిత్వము సామాన్యాంశాలుగా ఉంటాయని శ్రీ రామిరెడ్డిగారు చెప్పారు రెండవ వ్యాసము "మర్మ కవిత్వము" ఇందులో పాశ్చాత్య దేశాలలో శాస్త్రవిజ్ఞానం పెరిగిన కొలది కావ్యాలలో దివ్యానుభూతికి మారుగా మేధా వ్యాపారానికి ఎలా ప్రాముఖ్యం వచ్చిందీ, మర్మ కవులూ, సాంకేతిక కవులూ అనే నామాలు ఎలా కలిగిందీ వివరిస్తూ ఈ తెగకు చెందిన కవులలోనే యూరపు ఖండంలోని వివిధ దేశాలవారి మధ్యగల భేదాలను చూపెట్టారు అంతేగాక మర్మ కవిత్వంపై టాల్‌స్టాయి చేసిన విమర్శను

ఖండిస్తూ సామాన్య ప్రజలకు అర్థం కాకపోయినంత మాత్రంచేత ఆ కవిత్వమంతా దోష భూయిష్ఠమే అని చెప్పడం సాహసమంటూ భారతదేశంలో అనాదిగా మర్మ కవిత్వం ఎలా సృష్టింపబడిందీ సోదాహరణంగా వివరించారు

"నాటక కళా సంస్కరణము" అనే వ్యాసంలో ఆంధ్రదేశంలో ప్రయోగింపబడు నాటకముల తీరుతెన్నులను, మన నాటక కవులు, నటకులు, నాటక శాలలు ప్రేక్షక మండలినిగూర్చి కొన్ని వాస్తవాలను చెబుతూ కవి, నటక, ప్రేక్షకుల సహకార సహాయముల చేతనే నాటకశిల్పం సంస్కరింపబడాలనీ ఈ ముగ్గురూ తమ బాధ్యతలను గుర్తిస్తే మన నాటక కళకు మంచిరోజులు రాగలవనీ హితవు చెప్పారు

"అల్లసాని పెద్దన" అను వ్యాసంలో పెద్దనగారి మనుచరిత్రములోని శిల్పనైపుణ్యం విచారణ చెయ్యబడింది.

"నాటకము-చరిత్రము" అనే వ్యాసంలో చరిత్రకూ నాటక రచనకూ గల సంబంధం ప్రస్తావించబడింది. కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు కళాప్రపూర్ణ వేదం వెంకట్రాయశాస్త్రిగారి "ప్రతాపరుద్రీయము"లోని కథ చారిత్రకము కాదని ఒక విమర్శ వ్రాయగా దానికి సమాధానంగా రెడ్డిగారీవ్యాసం వ్రాస్తూ చరిత్రను నాటకకర్త మార్పు చేయవచ్చునీ, నాటకం కొన్ని కవి సమయాలకూ, కళానియమాలకూ లోబడినట్టి కళాసృష్టి అనీ అన్నారు

"అలంకారతత్త్వము" అను వ్యాసంలో భావప్రకట నావశ్యకతయే అలంకారములకు ప్రభవమని చెప్పబడింది

ఇంకా ఈ సంపుటిలో "తెలుగు కవితలో క్రొత్త తెన్నులు", "అభినవాంధ్ర సాహిత్యము", "చిత్రలక్షణము", "సాహిత్యములో రమ్యత", "నేటి కవితలో ప్రకృతిపూజ", "సాహిత్యంలో వైచిత్రి", "తిక్కన", "నా కవితానుభవములు" అనే వ్యాసాలున్నవి. వీనిలో చివర పేర్కొన్న వ్యాసం రామిరెడ్డిగారిని తమ అభిమానకవిగా ఎంచుకొన్న పాఠకులకేగాక సాహిత్య ప్రియులందరికీ ఎంతో ఆసక్తికరమైనది కవుల అనుభవాలను తెలుసుకోవడానికి పాఠకలోకం ఉవ్విళ్ళూరుతూ ఉంటుంది Love at first sight లాగా తమకు కవిత్వం యాదృచ్ఛికంగా లభ్యమైందని శ్రీ రామిరెడ్డిగారు చెప్పుతున్నారు.

గూళులకు వచ్చు పక్షుల కూజితములు
పంజకెంజాయగాంచెడి చక్కదనము
పరుల వినవచ్చు కీటకావ్యక్త గీతి
కాపు వానివి సైతము కవి నొనర్చు

అంటూ తమ ప్రథమ కవితా సంచలనానికి పైపరిస్థితులే దారితీసినవని శ్రీ రెడ్డిగారు అన్నారు.

సాహిత్య స్వరూప లక్ష్యాల విషయంలో రెడ్డిగారిది సమన్వయంగా కన్పిస్తున్నది. ఆధునికమైన ప్రతిదానినీ తెగడడం వారు హర్షించరు. ప్రాచీనమైన ప్రతిదీ ఉత్తమమైన

దన్నా వారు అంగీకరించరు తెలుగు కవితకు ఛందస్సు శాశ్వతమైన దంటారు భావం వుంచే వ్యాకరణ దోషాలతో అట్టే పట్టుకు కూర్చోరాదంటారు అర్థం పర్థంలేని వచనపద్యాలు నిష్ప్రయోజనములంటారు. రెడ్డిగారు ఒకవిధంగా లాక్షణికులు, మరోవిధంగా ఆధునికులు కాబట్టే ఉభయ వర్గాలవారి దృష్టి నాకర్షించారు

తెలుగు సాహిత్యంలో అసలే విమర్శన గ్రంథములు తక్కువ అందులోను ప్రాచ్య పాశ్చాత్యరీతులను పోలుస్తూ రెంటికీగల సాదృశ్య తారతమ్యాలను సూచించు గ్రంథములు మరీ తక్కువ కనుక ప్రాచీనార్వాచీన దేశవిదేశ సాహిత్యాల పరిచయంతో వివేచనచేసి విషయవివరణతో విలక్షణమైన శైలిలో కవితానుభవంగల వ్యక్తి వ్రాసిన ఈ వ్యాస సంపుటి సాహిత్యాభిలాషులందరికీ అవశ్యం పఠనీయమైనది.

—డి. రా.

## జమీన్ రైతు

### [దుర్ముఖి ఉగాది సంచిక]

ఆంధ్ర జమీన్ రైతు ఉద్యమానికి బాసటగా నిల్చి రైతాంగానికి విశేషసేవ చేసిన జమీన్ రైతు వారపత్రిక నెల్లూరునుంచి ఇప్పటికీ సక్రమంగా ప్రచురింప బడడం ముదావహమైన విషయం దుర్ముఖి ఉగాదికి ప్రత్యేక సంచికగా వెలువడిన ఈ పత్రికలో అనేకమంది ప్రముఖుల వ్యాసాలున్నవి ముఖ్యంగా బి నారాయణరెడ్డిగారి "కాళిదాసు కవితా కలాపం", పద్మశ్రీ స్థానం నరసింహారావుగారి "నా స్త్రీవేషం" అను వ్యాసాలు ఈ పత్రికకు ప్రత్యేకాలంకరణలని చెప్పవచ్చు ఇంకా రాజకీయములను గూర్చి, రైతుల సమస్యలను గూర్చి ముఖ్య వ్యాసములు ప్రచురింపబడినవి సిద్ధార్థుని "అభినిష్క్రమణం" అను ముఖచిత్రం ఎంతో రమణీయంగావుంది ఉగాది సంచిక నింత సర్వాంగ సుందరంగా వెలువరించిన మేనేజింగ్ ఎడిటర్ నెల్లూరు వెంకట్రామా నాయుడు, సంపాదకులు నెల్లూరు శ్రీరామమూర్తి గార్లకు ధన్యవాదములు

## విద్యార్థి

### [మన్మథ—మాఘం]

ఇది సిక్కోలు శ్రీకాకుళం తెలుగు సారస్వత సమితి తరఫున వెలువడిన పత్రిక సిక్కోలు శ్రీకాకుళం తెలుగు సమితి సాహిత్య వైజ్ఞానిక కార్యక్రమాలలో విశేష కృషి సల్పుతున్నది. సమితి చేసిన కృషిని సంపాదకులు పత్రిక చివరన "మేము—మా సమితి" అనే శీర్షిక క్రింద వివరించారు, ఈ సంచికలో పలువురు విద్యార్థులు మరియు ఆచార్యుల వ్యాసములు

ప్రచురింప బడినవి. ముఖ్యంగా విద్వాన్ గరికిపాటి లక్ష్మీకాంతయ్యగారి "రఘువంశ ప్రశంస", శ్రీ యం కులశేఖరరావుగారి "కావ్యాల్లో కన్నీరు", శ్రీ కె బాపురెడ్డిగారి "ప్రాచీన కావ్యాలు", శ్రీ యం రామిరెడ్డిగారి "ఆల్బర్టు ఐన్‌స్టైన్", కుమారి జానకీరాణిగారి "నంది తిమ్మన - పారిజాతాప హరణము" అను వ్యాసములు చదువదగి యున్నవి సంచిక ముద్రణ, ఎడిటింగ్ మిక్కిలి ప్రశంసనీయంగా వున్నవి. ఇందుకు సంపాదక వర్గంవారు అభినందనీయులు విద్యార్థులంతా ఈ పత్రిక నొకపర్యాయం అవలోకించడం మంచిది

## జ్యోతి

## [ఏప్రిల్ 1956]

మహబూబ్‌నగర్ జిల్లా కల్వకుర్తి ఉన్నత పాఠశాల తరపున వెలువడిన తెలుగు వార్షిక సంచిక ఇది. ఇందులో విద్యార్థులు వ్రాసిన గేయములు, కథలు, వ్యాసములు, ఏకాంకికలు కలవు ఇవి ఆయా విద్యార్థుల రచనా పటిమను వ్యక్తం చేస్తున్నవి చివరన పాఠశాల కార్యక్రమముల నివేదిక ప్రచురింప బడింది పట్టణాలకు దూరంగా ఉన్నా ఈ పాఠశాల విద్యార్థులు సాహిత్య కృషిపట్ల ఇటువంటి శ్రద్ధాసక్తులను ప్రకటించడం ప్రత్యేకంగా ప్రశంసనీయమైన విషయం

—డి. రా.

## గ్రామసుఖమే మన సుఖము

రచన — వినోబా

అనువాదం — చుండి జగన్నాథం

సహకారీ జనసాహిత్య లిమిటెడ్, హైదరాబాదు.

వెల : 5 అణాలు

శ్రీ వినోబాజీ హిందీలో వ్రాసిన ఈ పుస్తకాన్ని శ్రీ చుండి జగన్నాథంగారు తెలుగులోకి అనువదించారు

గ్రామ జీవితం ఏ విధంగా సుఖవంతమౌతుందో, ఈనాడు గ్రామాలు ఎందువల్ల పేదరికాన్ని అనుభవిస్తున్నవో ఈ పుస్తకంలో బాగుగా నిరూపించబడింది శైలి సులభవద్ధతిలో సాగింది.

- "వేముగంటి"

## వినోబా జీవితం

రచన లవణం

ఆర్థిక సమత సాహిత్యసమితి, పటమట (కృష్ణాజిల్లా)

వెల : 3 అణాలు

భూదానయజ్ఞముద్వారా అఖిల భారతదేశాన్ని ఆకర్షించి నూతన క్రాంతి పథంలో పురోగమిస్తున్న పూజ్యశ్రీ వినోబా భావేగారి జీవితాన్ని లవణంగారు చక్కగా, సరళమైన శైలిలో ఈ గ్రంథంలో చూపినారు

"వేముగంటి"

## గొబ్బూరి కృష్ణుడు

రచయిత యం ఆర్ నాగం

ఆదర్శసీమ, నూతనకల్లు.

'గొబ్బూరి గోపాలకృష్ణశర్మ' అనే ఒక తెలంగాణకవి జీవితాన్నిగూర్చి వ్రాయబడిన చిన్న పుస్తకం ఇది

యం ఆర్ నాగంగారు గొబ్బూరి కవితో తనకుగల సాహచర్యాన్ని పురస్కరించుకొని ఈ పుస్తకాన్ని సంతరించారు కవి జీవితాన్ని క్లుప్తంగా విశదీకరించారు

"వేముగంటి"

## భువన ఘోష

రచయిత

కె. వి. రమణారెడ్డి

పుటలు దెబ్బది నాలుగు

వెల : పన్నెండణాలు

ప్రచురణ

విశాలాంధ్ర ప్రచురణాలయం,

విజయవాడ-2

రచయిత ఆధునిక సాహిత్యకులకు సుపరిచితుడు. ఈ పుస్తకంలోని కవితల్లో చాలా మట్టుకు "ఛందో బందోబస్తులేని ఛట్‌పట్ మని" త్రెంచి వ్రాసినవి. సంస్కృత శబ్దాలు పిడుగులూ, పాషాణాలూ, వడగళ్ళ లాంటివనీ, ఉష్కాడంబరం కలవనీ, అందుచేత స్వచ్ఛమైన దేశీ పలుకుబళ్ళనే వాడాలనీ ప్రవేశికలో ఉల్లేఖించారు. ఈమాటని కొంతవరకు నిర్వహించ గలిగినా అక్కడక్కడ సంస్కృత పదాలని గుప్పించక తప్పలేదు. "అర్ధముక్త లజ్జాధిక నిర్ధన ముఖద్వార తీకవిత, స్వేచ్ఛా మఖాగ్నికుండము, సవిత", "ఫణామణి ప్రభాతదిల్లకాలసమ్మహాజ్వాలం" లాంటివి ఉదాహరణలు.

కొన్నికొన్ని కవితల్లో కవికున్న అసమాన ప్రతిభ వ్యక్తమౌతున్నా. శ్రీశ్రీ ప్రభావం మాత్రం ఆమూలాగ్రం ప్రతిబింబిస్తూంది. రచయిత శ్రీశ్రీకి అనుయాయుడు కావడమే అందుకు కారణం "ప్రస్థాన భేరి" అనే శీర్షికలో "ముందుముందు మహాయుగం. ముందున్నది ముందున్నది" అని చదువుతుంటే "జగన్నాథ రథచక్రాలు" తరలి వస్తున్నట్లుగానే ఉంటుంది "వజ్రహాసం", "క్రావ్యాక్రువు" తెలంగాణా విప్లవాన్ని చిత్రించే శీర్షికలు వీటిలో కవికి స్వీయ సంస్కృతి. నాగరికతా బుగ్గి అవుతున్నప్పుడు కలిగిన ఆవేదనా, ఆవేశమూ ప్రస్ఫుటమౌతున్నాయి అయితే "లెనిన్"ని గురించిన రెండు గీతాలూ, "స్టాలిన్ అస్తమయం"ని గురించిన మరి రెండు గీతాలూ వాటికి విరుగుడులుగా ఎసిచేస్తున్నాయి

'ఓ చల్లపల్లి నారాయణ రాయా
లంకసీమకే ఆహుతైనావా
రంకు రాత్రికి గాపు అయినావా'—అంటూ

సుప్రసిద్ధ జానపద గేయం 'ఓ గుర్రాల గోపిరెడ్డి. దాచేపల్లికె దానమైతివా' మాదిరిగా ఆరంభమైంది 'రక్తాశ్రువు' అనే గీతం ఈ గీతం వల్ల 'చల్లపల్లి' శాశ్వతమైన కీర్తిని సంపాదించాడనవచ్చు

అర్ధము రాతిరి వేళ ఎప్పుడో
దొబ్బరింత విసిపించిందంటే.
వాతావరణం ప్రసంపించితే
ఆడునో. బెబ్బురి చల్లపల్లి నా
రాయణరావే లేచాడిందుము

ఎగిశాదందుము ఖొడిచాడందుము—ఈ రకపు హృద్యమైనశైలి గీతం నిండా పాదుకుపోయి చల్లపల్లి నారాయణరావు పైని నిర్వ్యాజమైన సానుభూతిని రేపుతూంది

ఈ పుస్తకంలో ఒక్క పెద్ద లోపముంది అది వ్యక్తి దూషణ 'ఆంధ్ర కవిత్వ చరిత్ర'లో మనకు నన్నయ మొదలుకొని నేటివరకున్న కవుల జాబితా కొంత లభిస్తుంది. అందులో రాయప్రోలు సుబ్బారావుని గురించిన దూషణ ఉంది ఆ తరువాత శ్రీశ్రీని గురించి పాడుతూ ఏందన విపంచి మీటాడు అందులో—

కవుల 'కులపతు' లే కిరాట్టులు
కలిసినా అతడప్రధృష్యుడు

అని తనకభిమానకవియైన శ్రీశ్రీని గురించి పాడడంలో అర్థముంది కాని

మాయదారులు రాయప్రోలులు
విషభుజంగాల్ విశ్వనాథలు
మతము దేశము వారి చేతుల
గతదురావేశముగ చెడిపవి
రిత్తకౌగిలి రాయప్రోలుది
కత్తికౌగిలి విశ్వనాథది—

అవతరంలో కవికి రాయప్రోలు, విశ్వనాథలపై ఉన్న ద్వేషం బహిర్గతం కావడం మినహా ఆయనకున్న విశాలదృష్టి ఏమీ కనపడ్డంలేదు. అందరికీవలెనే గురజాడ, కందుకూరి, గిడుగులపై ఉన్న ఆదరం ఈయనకూ ఉంది. కాని వ్యక్తిదూషణ అనే మబ్బు దాన్ని కప్పివేసింది

'అందరూ నన్నింటి వర్ధంకి లేక
నీతిగా నియతంగ నమతవించ'—తమే

కవి రచనలలోని లక్ష్యం ఆ లక్ష్యసిద్ధికే ఆయన గమనం అందుకు మిగిలిన ప్రపంచమంతా తనకు తోడౌననే నమ్మకం కలిగి ఉన్నారు కాని తన లక్ష్యాన్ని చేరుకోడానికి విదేశ జాతీయ గంధాన్ని మెయినిండా పులుముకుంటేమాత్రం ఎన్నటికి ఆయన ఆశయం ఫలించదు

—"వల్లపురెడ్డి"



*హిందీప్రచార వార్తలు :*

# స్వాగతోపన్యాసము

*—శ్రీ మోటూరి సత్యనారాయణ*

*(గీతాప్రెస్ వారిచే ఏర్పాటు చేయబడిన "గీతాప్రెస్ యాత్రా స్పెషల్" లోని యాత్రికుల స్వాగతోత్సవ సందర్భంలో శ్రీ మోటూరి సత్యనారాయణ గారి స్వాగతోపన్యాసము )*

గౌరవనీయులైన శ్రీ గవర్నర్ ప్రకాశం, గీతాధర్మ ప్రచారక శిరోమణి శ్రీ హనుమాన్ ప్రసాద్ పోద్దార్ జీ, సోదర సోదరీమణులారా!

దక్షిణ భారత హిందీ ప్రచారసభా ప్రాంగణములో ఉత్తర భారతములోని ధర్మ పరాయణులు, ఈశ్వరభక్తులు, జ్ఞానపిపాసువులైన మీ యాత్రికులకు స్వాగత మొసగుచున్న మాకు అమితానందము కలుగుచున్నది మీరు దక్షిణ భారతములోని పశ్చిమ, నైఋతి, తూర్పు ప్రదేశాలను సందర్శించి, ఉత్తర దిశోన్ముఖులగుచు నేడు మద్రాసు నగరమునకు విచ్చేసియున్నారు మీరిచ్చటినుండి ఆంధ్ర దేశములోని పుణ్యక్షేత్రములను దర్శించనున్నారు మీ యీ యాత్రాకార్యక్రమంవల్ల తామీ యాత్రలో పుణ్యభూమి

యైన సంపూర్ణ భారతదేశమును పరమయోగిపుంగవుల, ఆచార్యుల పాద రజస్సుచే పునీతములైన పుణ్యక్షేత్రములను దర్శించగలిగినారు మీకు మా హృదయపూర్వక ధన్యవాదములు పుణ్యతీర్థముల నన్నిటిని సందర్శించి తీర్థరూపులైనారు.

సంపూర్ణ దక్షిణ భారతమును సందర్శించిన మీకు దక్షిణదేశము నందలి విశేషములు తెలిసియే యుండును ఈ యాత్రలో ఆశాశించినంత ఆనందమును పొందియే యుందురు హిందీ సాహిత్యమున వ్రాయబడి యున్నందున దక్షిణభారత దేశములోని పుణ్యక్షేత్రములు, భక్తులు, ఆచార్యుల మహిమా విశేషములు ఉత్తర భారతీయులకు తెలిసియే యున్నవి

"భక్తి ద్రావిడ ఊపజీ" ("ద్రావిడదేశమే భక్తిని సృష్టించినది" అను వాక్యమునకు చాలా ప్రాముఖ్యత కలదు) ఈ వాక్యము హిందీ సాహిత్యకారులకు పరిచితమే, దక్షిణ భారతము అనేకమంది జ్ఞానులను కర్మనిష్ఠులైన భక్తులను సృష్టించినది అంతేగాక ఇచటి సంస్కృతి పౌరాణిక మహాగ్రంథమైన రామాయణమును రచించిన మహాకవి వాల్మీకిని కూడ ఆకర్షించి, భక్తి శక్తులకు ప్రతిమూర్తియైన హనుమంతుని వంటి పాత్రను సృష్టింప జేసినది

దక్షిణ భారతమున పరమ నిష్ఠతో రామునిపూజ జరుగుచున్నట్లు ఉత్తర భారతమున హనుమంతుని పూజ జరుగుచున్నదనే విషయము మీకు తెలిసినదే తాము మర్యాదా పురుషోత్తముడైన శ్రీరాముని జన్మస్థానమైన అయోధ్యా ప్రాంతమునుండి వచ్చియున్నారు కావున మర్యాదా పురుషోత్తముడైన శ్రీరాముని జీవితాదర్శమును దృష్టియందుంచుకొని ధర్మ ప్రచారమును జేయుట, రాముని భక్తుడైన హనుమంతుని జన్మస్థానమును సందర్శించవలె ననెడి జిజ్ఞాస కలిగియుండుట తమ బోంట్లకు స్వాభావికమైన విషయమే

దక్షిణ భారతదేశము పరమ భక్తులను సృష్టించుటయందే గాక, గొప్ప గొప్ప విద్వాంసులను, ఆచార్యులను సృష్టించుటలో గూడ చాల ప్రసిద్ధి గాంచినది భారతీయ ధర్మమును, జ్ఞానమును సజీవమొనర్చుటయేగాక ప్రపంచ వ్యాప్తము జేసిన ఆచార్య చతుష్టయమునకు జన్మస్థానము దక్షిణదేశమే కేరళ ప్రాంతీయుండైన శంకరాచార్యుని అద్వైతవాదము, తమిళ ప్రాంతీయుడైన రామానుజాచార్యుని విశిష్టాద్వైతము, కర్ణాటక ప్రాంతీయుడైన మధ్వాచార్యుని ద్వైతసిద్ధాంతము, ఆంధ్ర ప్రాంతీయుడైన వల్లభాచార్యుని

పుష్టిమార్గ శుద్ధాద్వైత సిద్ధాంతములు సర్వవిదితములే ఈ ఆచార్యులు జ్ఞానము ద్వారా బౌద్ధికమయిన ఏకత్వమును స్థాపించుటకు దేశమునందు నలుమూలల పుణ్యక్షేత్రములను ఏర్పరచి భారతీయ భౌగోళిక ఐక్యతను దృఢపఱచుటకు భక్తిద్వారా హృదయ సమైక్యతను సాధించుటకు అపారమయిన కృషి చేసియున్నారు వీరి కృషి ఫలితముగనే నేటికిని భారతదేశము తన అస్తిత్వమును సజీవముగను, శక్తివంతముగను నిల్పుకొనగలిగి తన భవిష్యత్తును సముజ్జ్వలము చేసికొన ప్రయత్నించుచున్నది ఉత్తర దక్షిణదేశ సంస్కృతులలో భిన్నత్వము చూచువారికి ఈ సంస్కృతులలో పరస్పర భేదమును సృష్టింప బూనుకొన్న వారికి భారతీయ ఐక్యతను నిరూపించు ఈ ఉదాహరణమే చాలు

మన దేశమునందలి అతి ప్రాచీనము, సంపన్నము ఐన సంస్కృతము నందును ప్రస్తుత జాతీయభాషయైన హిందీ యందును, తదితర ప్రాంతీయ, భాషల యందును గల అనంతమయిన సాహిత్యమే మనలోగల కొద్దిపాటి భేద భావములను తొలగించుటకు సరిపోయినప్పటికిని, తమబోటి సదాచారుల యాత్రలవలన ఈ ఐక్యత దృఢతరము కాగలదనుటలో సందేహములేదు తమ ఈ యాత్ర 'గీతా ప్రెస్ యాత్రా స్పెషల్' అనే పేరుతో ప్రసిద్ధి జెందినది గీతా ప్రెస్ తమ కార్య కలాపములన్నిటికిని కేంద్రబిందువు వంటిది గీతా ధర్మము తమ ప్రయత్నములకు ప్రధానాశయము ఈ ప్రెస్ ద్వారా తాము లక్షలకొలది గృహములలో జ్ఞానమును, భక్తిని ప్రచారము చేసినారు 'కల్యాణ్' అనే తమ పత్రిక ద్వారా అనేక కుటుంబములకు మేలు కలిగించినారు దుఃఖముతోను, భయముతోను నిండిన అనేక హృదయాలలో భగవంతునిపట్ల శ్రద్ధాభక్తులు కలుగునట్లు చేసినారు నిర్ధనులు, అశక్తులు అయిన వారికి కొద్ది వెలలో సాహిత్యమును అందించి భగవద్భక్తిని సాధించుటయందు వారికి సహాయమును చేసియున్నారు తాము భక్తితో శక్తిని జతపరచినట్లే విరక్తితో కూడిన నైతికతతో లౌక్యమును జతపరచినారు అందుచేత ధార్మిక భావములనేగాక భక్తులను కూడ తమ ప్రయత్నముతో సంఘటితము చేసినారు గీతా ప్రెస్ ద్వారా తాము అనేక వ్యక్తులను, ఆత్మలను ఉద్ధరించినారు మీ యీ సంస్థయొక్క ఆశయము అద్వితీయము, అనుసరణీయము

జాతిపిత మహాత్మాగాంధీజీచే స్థాపించబడిన దక్షిణ భారత హిందీ ప్రచారసభ ప్రాంగణమున ఇప్పుడు తమకు స్వాగత మొసగు చున్నాము మన దేశమున నిర్మాణ కార్యకలాపములను నడుపు సంస్థలలో దక్షిణ భారత

హిందీ ప్రచారసభ పురాతన మయినది, వ్యాప్తి జెందినది దేశైక్యతను దృఢ పఱచుటకు సామాన్య ప్రజానీకమునకు సుబోధక మయిన విధమున హిందీ భాషా ప్రచారమును చేయడమే ఈ సంస్థయొక్క ముఖ్యోద్దేశ్యము ఒక దృఢ మయిన రాజ్యమునకు ఒక జాతీయభాష అవసరము కావున జాతీయ నిర్మాణమునకు హిందీభాష ఒక ప్రచారసాధనము, జాతీయతా లక్ష్యము హిందీ ప్రచారకులమయిన మేము గీతా ప్రెస్ కార్యకర్తలు మీరు ఒకే మార్గమున పయనించు బాటసారులము కారణమేమన మీకు సాధ్యము ధర్మస్థాపనఅయినను సాధనము హిందీయే హిందీ ప్రచారమును సాధనముగ తీసికొని మీరు ధర్మ ప్రచారమును, ధర్మమును లక్ష్యముగా గ్రహించి హిందీ ప్రచారమును చేస్తారు హిందీ ప్రచార కార్యమున మా సంస్థకు తగినంత విజయం లభించినదని సగర్వముగా తెలియజేయుటకు మీరు అనుమతించ గలరని మా విశ్వాసము

దక్షిణ దేశస్థుల సహకారమే మీ యీ విజయమునకు ముఖ్య కారణము భారతీయ ఐక్యతకు సాధన రూపమున హిందీని అలవఱచు కొనుటకు దక్షిణ భారతీయులు అకుంఠిత దీక్షతో కృషిచేయుచున్నారు ఈ దీక్షా ఫలితముగా ఈనాడు దక్షిణ దేశమున ౪౦౦౦ మంది కార్యకర్తలు వివిధ కేంద్రాలలో పనిచేయుచున్నారు సుమారు ౫౦౦౦ కేంద్రములలో ఇప్పటికి హిందీ ప్రచారము జఱిగినది, ఈ సంస్థ కృషి ఫలితముగా ఈ ప్రాంతపు విద్యావంతులలో జఱిగిన హిందీ ప్రచార వివరము తమకు ఆనందమును గలుగజేయ గలదు

ఉత్తమ ప్రచురణముల ద్వారా, కార్యకర్తలద్వారా, ఉపాధ్యాయుల ద్వారా ఈ సంస్థ తన కార్యక్రమములను నడపినది ఇప్పటికి సుమారు రెండు వందల గ్రంథములను సభ ప్రచురించినది ఉత్తరమున ప్రాణహితనుండి, దక్షిణమున కన్యాకుమారి వఱకును, బరహామ్ పురమునుండి బెల్గామ్ వఱకును దక్షిణభారత హిందీ ప్రచారసభ కార్యక్షేత్రము వ్యాపించి యున్నది పశ్చిమ భారతము యొక్క ప్రాదేశిక సంస్థలయిన గుజరాతు విద్యాపీఠ్, మహారాష్ట్రభాషా సభలతోను, తూర్పున ఉత్కళ, బెంగాల్, అస్సాం సభలతోను రాష్ట్రఅఖిల భారతీయ హిందీ పరిషత్తు ద్వారా సంబంధమును జోడించుకొని క్రమబద్ధ మయిన విధముగా ఈ సభ తన కార్యకలాపములను నడపినది నేడు ఈ సంస్థలయొక్క సుసంఘటిత ప్రచారము వలన హిందీ విద్యార్థుల సంఖ్య లక్షల సంఖ్యలో వృద్ధిజెందు చున్నది గత సంవత్సరము దక్షిణ దేశములోని

హిందీ పరీక్షలలో పాల్గొనిన విద్యార్థుల సంఖ్య సుమారు ౧,౦౦,౦౦౦ వరకు ఉన్నది ఈ విధంగానే తూర్పున ౨౩ ౪౦౫ పశ్చిమమున గుజరాతులో ౬౯ ౦౧౭, మహారాష్ట్రములో ౧ ౦౧ ౪౦౯ వరకు విద్యార్థుల సంఖ్య కలదు తూర్పున ఈ సంస్థ కార్యక్షేత్రమున అభివృద్ధి పరచుటకు ప్రయత్నములు జరుగుచున్నవి ఈ ప్రాంతపు భాషయు హిందీకి సన్నిహితములుగా నుండుట వలననేమో ఈ ప్రాంతమున హిందీ ప్రచారము చురుకుగా వృద్ధిజెందుటలేదు.

[illegible]లకొలది సంవత్సరముల నుండి మన పూర్వ రాజులచే సాధింపబడి ఈ [illegible] వారి [illegible] గా [illegible]మర్పింపబడిన ఐక్య[illegible] హిందీ ప్రచారము ద్వారా మ[illegible]ల [illegible] [illegible] మ లక్ష్యము [illegible] ఇదే [illegible] [illegible] మాకు [illegible] భావము స్ఫురించి[illegible] [illegible] భాగ్యము [illegible] [illegible] [illegible] చేత [illegible] [illegible] మా [illegible]

—(సం) మోటూరి సత్యనారాయణ



